శర్వాంభోమహ లోచనాప్రవిలసచ్చామీకరాగారయుత్
సర్వైశ్వర్యకరీ నగాధిపతనూజాతా జగన్మాతృకా.

ఇది శ్రీసకలకవితాస్వతంత్రభట్టారక ...కూచి బాలసరస్వతికవి మహోపాధ్యాయప్రణీతంబైన యాంధ్రశబ్దచింతామణి టీకాగ్రంథంబు నందు, క్రియాపరిచ్ఛేదము పరిపూర్ణము.

7. ఆంధ్రశబ్దచింతామణి — బాలసరస్వతీయము. 537

ఇందు 34 పత్రములు గలవు వ్రాత చక్కనిది. తప్పులు మెండు. పత్రము లటనటఁ గ్రిమిదష్టములు. ఉన్నంతదనుక గ్రంథపాతములు లేవు. వ్రాయసగాని పేరు గానరాదు.

సంజ్ఞాసంధిపరిచ్ఛేదములు పూర్ణముగను, అజంతపరిచ్ఛేదమున 'స్వంతాన్నామ్నః కు ఁ ర్బహువచనే' ఇత్యాది యార్యతుదివఱకుఁ గలభాగ మిందు వ్రాయఁబడినది. ఆరంభమునఁ గృత్యాదిపద్యములు లేవు. సంజ్ఞాసంధిప్రకరణములతుదిని పద్యగద్యములు గలవు. వ్రాత యందలి మార్పులు తప్ప మిగిలిన విషయమంతయుఁ బైప్రతిని బోలి యున్నది.

సంధిప్రకరణము తుదిని:—

శా. క్లీంకారాక్షరరూపిణీ నతజనక్లేశౌఘసంకావనీ
పంకేజాతసుహృద్ఘనాసవనవృక్స్వాదాబ్జశశ్వన్నిరా
తంకాత్యూర్జిత భోగమోక్షజనకోదంచన్మహామాయకా
హ్రీంకారాక్షర హేతుసాధకవరబ్రహ్మేంద్రాదిదేవార్చితా.

ఇది శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్రశబ్దచింతామణియందు, యలకూచి బాలసరస్వతిమహోపాధ్యాయప్రణీతాంధ్రశబ్దచింతామణిటీకాగ్రంథంబునందు సంధిపరిచ్ఛేదము తృతీయము.

8. ఆంధ్రశబ్దచింతామణి — బాలసరస్వతీయము. 4597.

ఇది 34 పత్రములు కలది. వ్రాత చక్కనిది. తప్పు లంతగ లేవు. పత్రములున్నంతదనుక మంచిస్థితిలో నున్నవి. తొలుత నెనిమిదిపత్రము లకొనలు మాత్రము త్రుటితము లయినవి. వ్రాయసగాని పేరు లేదు.

కృత్యాదిపద్యములు, 'విశ్వశ్రేయఃకావ్యం' ఇత్యాదిశ్లోకవ్యాఖ్యానముతోఁ గూడినభాగమును నిందు లేవు. 'స్వస్థానే' త్యాదిశ్లోకవ్యాఖ్యానములోఁ గొంతభాగము గడచినపిమ్మటఁ బ్రారంభము. అది మొదలుగ హలంతపరిచ్ఛేదమునందలి "సంస్కృతోపదేశ పరిమిత మాంత్రపదం కర్మధారయో భవతి" ఇత్యాదిశ్లోకవ్యాఖ్యానము తుదివఱకుఁ గలదు. సంజ్ఞ సంధి అజంతపరిచ్ఛేదముల తుదిపద్యములు గలవు. అజంతపరిచ్ఛేదాంతభాగము.

శా. కర్ణాంతాయత చారునేత్రకమలా కర్పూరపూర్ణప్రభా
వర్ణశ్రీకరయంత్ర తాడిత విభాస్వద్రూపచిద్రూప సా
వర్ణోదంచిత మండపాంకమున దీవ్యద్దివ్యసింహాసనాం
తర్నిష్పంద విహారహారకలితోద్యత్కాంతికాభూషణా.

గద్య. ఇతి శ్రీసకలభాషాస్వతంత్రభట్టారక యలకూచి బాలసరస్వతీ కవిమహోపాధ్యాయప్రణీతంబైన శబ్దశాసనటీకా గ్రంథంబునందు అజంతపరిచ్ఛేదము సంపూర్ణము.

### 9. ఆంధ్రశబ్దచింతామణి—బాలసరస్వతీయము.

ఇందు 113 పత్రములు గలవు. వ్రాత బాగుగ లేదు. తప్పులంతగఁ గానరావు. పత్రము లటునటుఁ గొలఁదిగఁ గ్రిమిదష్టములు. ఉన్నంతదనుక గ్రంథపాతము లేదు.

తొలుత 45 పత్రములు చింతామణి బాలసరస్వతీయమును, ఆవెనుక 6 పత్రములు చింతామణి కారికలును, పిమ్మట 62 పత్రములు అహోబలపండితీయ వ్యాఖ్యయును గలవు. అహోబలపండితీయమున సంజ్ఞాప్రకరణము ఆరంభమునుండి తుదివఱకుఁ గలదు. కృత్యాదిశ్లోకములు మాత్రము లేవు.

బాలసరస్వతీయటీక ప్రారంభము :—

ఉ. శ్రీకరశాఖమై ద్విజనిషేవితమై సుమనఃప్రజీవనం
బై కలధౌతసుందరమహాచ్ఛదమై సుమసారవద్ద్యుతి

ప్రాకటమై ప్రశస్తపదపల్లవమై యలరారు నాశ్రితా
నీకఫలప్రదంబు హరినిర్జరశాఖి సమాశ్రయించెదన్.

సీ. చిన్ని చెందొవవిందు కన్నె గెడఁగి రేకు
దోఁపిన యందంపుఁ దారుముతోడ
సరసదూర్వాదళాంకురగుచ్ఛకచ్ఛాయ
లీను నిద్దంపు నెమ్మేనితోడఁ
గరుణారసమరంద భరసంభృతమ్ములై
తనరు నేత్రారవిందములతోడఁ
గాలాహిక్రియ నభక్తజనంబులను భయమొ
త్పాద హరాభయహస్తంబుతోడ
గీ. హృదయమునఁ గానుపించి యాంధ్రకృతిప్ర
బంధశబ్దార్థ విజ్ఞాన భవ్యశక్తి
యొసఁగుఁ గావుతఁ దల్లి భక్తసంతత
లావి దక్షిణకాళికాదేవి నాకు.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి మున్నొక్కనాఁడు విద్యానగరిలో నచింత్యకారణోపాగమున స్నేహసాహచర్యంబున శివయోగివర్యుచే దేవచోదనంబున ప్రాప్తమైన యాంధ్రశబ్దచింతామణి గ్రంథంబు లోకోపకారార్థంబుగాఁ దీని గావింపంగోరి నెమ్మనంబున.

ఉ. ఏమి మహాద్భుతం బిది హరీ హరి యెక్కడి యాంధ్రశబ్దచిం
తామణిశక్తి యెక్కడి మతంగనగంబు యుగాదిసంభవుం
డై మఱి చన్న నన్నయమహాకవి యెవ్వఁడు, సిద్ధుఁ డెవ్వఁడా
హా మదగణ్యపుణ్యసముద్రగతఁ జేకుఱెఁ గాదె యిన్నియున్.
మ. ఇలఁ బ్రఖ్యాతికులౌ కవుల్ మునుపు లేరే వారు వ్యాఖ్యానక
ర్తలు గారో పరె, పెక్కు వత్సరము లంతర్భూతమై యున్న యీ
తెలుఁగు వ్యాకరణంబు నాకొసఁగెఁ బ్రీతిం టీక గావింపు మం
చల సిద్ధుండు మదిష్టదేవత విహాసాఖ్యుండు నిక్కంబుగన్.

వ. అని గణించి లోకోపకారసుకృతకీర్తిలాభవితర్కంబునం బ్రహర్షించి యాంధ్రవ్యాకరణభాష్యనిబంధనోత్సుకుండనై యందాది నస్మచ్ఛరిత్ర మభివర్ణించెద.

సీ. స్థిరకీర్తి యెలకూచి తిప్పనార్యుఁడు గాంచె
శుచిశీలు వల్లభసోమయాజి
సతనికిఁ దిప్పన్న యజ్ఞన్నయు ననంగ
సుచరిత్రు లిద్దఱు సుతులు పుట్టి
రాతిప్పనకు భైరవన్న నన్నయ నాఁగ
నలఘు లిద్దఱు తనూజులు జనించి
రాభైరవునకు నోజ్జర తిర్మలయ్య రా
మనయుఁ జిట్టపయు సూరనయుఁ గల్గి

గీ. రాతిరుమలేంద్రుఁ డళియరామావనీశ
దత్త యెనపిల్లి ముఖ్యసద్గ్రామహేమ
చామరచ్ఛత్రపల్యంకికామణీవి
భూషుఁడై వైదుషీస్ఫూర్తిఁ బొలుపు మించె.

ఉ. అత్యనఘుండు రామసుముఁ డాత్మజులం గనియెన్ శుచిత్వసాఁ
తత్యగభీరు భైరవుని నాగన నప్పన రామధీమణిన్
ధృత్యమరాద్రిభైరవమనీషికిఁ గల్గిరి సత్కుమారు లా
దిత్యుఁడు కృష్ణసత్కవి సుధీజనవందితుఁ డప్పనార్యుఁడున్.

గీ. పాకనాటి సకలపండిత కవిజనా
చార్యుఁడైన కృష్ణయార్యవర్యు
నకును లక్ష్మమాంబికకు నేను నాదిత్య
కవియుఁ గల్గితిమి జగన్నుతులము.

సీ. భాష్యాదిబహుశాస్త్రపరిచయోదాత్తుఁడ
కౌముదీనాటకకావ్యకవిని
భాషావివరణాఖ్యభవ్యశాస్త్రకరుండ
బాహటస్థాననిబంధనుండఁ

చంద్రాపరిణయాదిసత్కృతిస్రష్టను
దీప్రవామనపురాణప్రబంధ
గ్రామణీగీతప్రబంధౌఘకర్తను
దక్షిణకాళికాతంత్రచణుఁడఁ

గీ. ప్రకటరాఘవయాదవ పాండవీయ
నామకశ్లేషకవితాప్రగల్భుఁడను
ననఘకౌండిన్యగోత్రుండ నఖిలసుకవి
తాస్వతంత్రుండ బహుళకళాఢ్యుఁడ నేను.

వ. ఆంధ్రశబ్దచింతామణి తెలిఁగించెద, నిది యెల్లి సకలకవితాప్రవర్తకుండగు శబ్దశాసనుండు సకలకవిహితంబుగా యథోచితసూత్రగర్భితంబులగు నార్యావృత్తంబులఁ బంచపరిచ్ఛేదకంబుగా సమకట్టె; నేను నానేర్పుకొలందిఁ దత్సూత్ర విభాగంబును దత్ప్రమేయవివరణంబును దదుదాహరణస్వరూపంబులును, సంధ్రమయగద్యపద్యంబుల నేర్పరించి, నాయాత్మదేవతయగు నంబాదేవి కర్పించువాఁడ నదుపక్రమం బెట్టిదనిన "విశ్వశ్రేయః కావ్య" మిత్యాది.

గ్రంథాంతభాగము:—

శ్లో. అత్వాది తత్సమానా మివ దేశ్యానాం క్రియాపదానాం స్యాత్
వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు.

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

"దీని తాత్పర్యము:—దేశీయ తెలుఁగులకు ఎత్వాత్వాదులు సమాంతే అవును. స్థానస్థానాల వర్ణవిశేషాలు వింత. అదెట్లనంటె-వచ్చె అనే క్రియకు తద్ధర్మమధ్యమపురుషకు వత్తు-లృడర్థమందు రాఁగలఁడు, ప్రోచు అనే క్రియకు బహువచనమందు-ప్రోతురు - ప్రార్థనమందు ప్రోవుము - చనియె, వినియె - ఇత్యాది. క్రియలకు భూతార్థమందు వచ్చె ఎత్వము పరమై యుండగా ఇకారము - ఇవి మొదలయిన వర్ణాగమాలు బహువిధాలు ప్రయోగవేద్యాలు - ప్రయోగము ఆవశ్యకము ఇత్యాది."ఇతి

సకలభాషావాగనుశాసన శ్రీనన్నయభట్ట విరచితాంధ్రశబ్దచింతామణౌ క్రియాపరిచ్ఛేదః.

—: అహోబలపండితీయము :—

గ్రంథారంభము :—

విశ్వశ్రేయః కావ్యం ఇత్యాది- సమస్తశ్రేయస్సాధనం కావ్యం. శుద్ధసారోపలక్షణయా అవ్యభిచారేణ కావ్యనిష్పాదకత్వం ధ్వన్యతే. కవతి - కూయతీతి కవి స్సచ సత్కులీన శ్శుచి ర్దక్ష శ్ఛందోవ్యాకరణాదివిత్ -ప్రశాంతస్సుభగాకారో దైవజ్ఞ శ్చ కవిర్భవే దిత్యాది... ...

సంజ్ఞాప్రకరణము తుదిభాగము :—

ఇతి శ్రీమత్సీతారామచరణారవిందమిళిందాంతఃకరణేన శ్రీమత్పోలూరిమాధవయజ్వ సముజ్వ.........క్షసాదిత సాదుష్పాండిత్యాభరణేన ప్రభంజనవంశాబ్ధిరాకాశశాంకేన అభినవ నన్నయభట్టాచార్యేణ విరచితాయాం కవిశిరో.........చింతామణివ్యాఖ్యాయాం ప్రథమ స్సంజ్ఞాపరిచ్ఛేదః. శ్రీకృష్ణార్పణమస్తు.

10. అహోబలపండితీయము. గ్రం. సం. 3826.

ఇది నన్నయభట్టవిరచితమయిన ఆంధ్రశబ్దచింతామణికి విపులమయిన సంస్కృతవ్యాఖ్యానము. సంపూర్ణము. ఇందలి పత్రములు 142. వ్రాఁత చక్కఁగ నున్నది. తప్పులు సాధారణముగ లేవు. గ్రంథపాతము లేదు. పత్రము లటనటఁ గ్రిమిదష్టములయినను విషయ మంతయు సమగ్రముగనేయున్నది. ఏనుగ తిమ్మనార్యుని పౌత్రుఁడగు పేరాజకవివర్యుఁడీప్రతివ్రాసికొనినట్లు గ్రంథముతుదిని గద్య యొక్కటి వ్రాయఁబడినది.

"శ్రీమదుమారమణకరుణాకటాక్షవీక్షాపాత్రేణ యేనుగతిమ్మనార్యపౌత్రేణ వీరభద్రామాత్యపుత్రేణ, శ్రీవీరమాంబాగర్భశుక్తిముక్తామణినా, శుకవిగర్వాంధకారదినమణినా పేరాజకవిమణినా లిఖితోఽయం-శ్రీమన్నన్నయభట్టారకప్రణీతాంధ్రశబ్దచింతామణివ్యాకరణవ్యాఖ్యాయాం కవిశిరోభూషణాఖ్యాయాం పంచమః క్రియాపరిచ్ఛేదః."

వ్రాఁత ముగిసిన శుభదిన మెద్దియో తెలియరాదు. ఈతఁ డాకసంస్కారవిశిష్టుఁడయిన కవివరుఁడనుటకు నిదర్శనమయిన గ్రంథలేఖనము కొంత సాక్ష్య మిచ్చుచున్నది. వ్రాఁతయెల్లెడలను నిర్దుష్టముగనే యున్నది. అక్కరములు సుస్పష్టముగ నున్నవి.

గ్రంథారంభము :—

శ్లో. శ్రీమద్భూమిసుతాలలోదరీ తనుభవావక్షోజసత్పంజర
స్ఫాయత్కీరమణి ర్గిరిప్రవరజాచిత్తాబ్జభృంగాగ్రణీః
భక్తవ్రాతమనోవ్యథాదవశిఖాప్రోద్భూతవర్షాంబుదో
రామ స్సర్వజగంతి పాతు సతతం కారుణ్యపాథోనిధిః. ౧
తాపం నోపరతా ద్ధరోజ్జ్వలశిరోలంకార పాదాంచితో
గాఢోన్నిద్రకలావిలాసవసతిః పద్మాసుహృద్ద్యోతకః
జీవాతుః సతతం సమస్తసుమనోబృందస్య మాద్యత్తమో
భేదీ శీతలగో విభాతి రమలః శ్రీరామచంద్రో విభుః

... ... ... ...

... ... ... ...

జ్ఞాత్వార్థం హ్యుభయత్ర వాక్యరచనావ్యుత్పత్తి రాకర్ణనే
నేత్రాణాంచ పురాదివర్ణనమపి శ్రేయః ప్రవత్వం తథా
శ్లాఘ్యత్వం భగవద్గుణాదికథనే తద్వర్జనే శ్లాఘ్యతా
తద్భేదో న పురాణవక్తృకవిరాడ్జల్పాంధ్రసత్కావ్యయోః ౮౫

పై రీతినిఁ గృత్యాదిశ్లోకము లన్నియు నిందుఁగలవు.
ఇఁక వ్యాఖ్యానారంభము.

శ్లో విశ్వశ్రేయః కావ్యం తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ
సా వా గ్యా రసవృత్తిః సాధ్యో హి రసో యథాతథం కవిభిః.

సర్వాణి గ్రంథే ఽస్మిన్ పథ్యార్యాగీతివృత్తాని "లక్ష్మే త్సప్త గణాగోపేతా నేమా భవతి విషమే జః" ఇత్యాది సామాన్యలక్షణాత్, "త్రిష్వంశకేషు పాదో దళయో రాద్యేషు దృశ్యతే యస్యాః-పథ్యేతి

నామ తస్యాశ్ఛందోవిద్భి స్స్ఫుటం సమామ్నాత” మితి విశేషలక్షణాచ్చ, “ఆద్యర్ధసమా గీతి రితి” పైంగలసూత్రాచ్చ. గురులఘుప్రమాణనిశ్చయాది తత్ప్రపంచనంతు వృత్తరత్నాకరే తద్వ్యాఖ్యానే లలితే చ ద్రష్టవ్యం.

విశ్వశ్రేయః కావ్యం - కీర్త్యాదిసమస్తశ్రేయస్సాధనం కావ్యం. శుద్ధసారోపలక్షణయా అవ్యభిచారేణ కార్యనిష్పాదకత్వం ధ్వన్యతే. కవయతే వర్ణయతీతి కవిః సచ సత్కులీనః శుచి ర్దక్ష శ్ఛందోవ్యాకరణాదివిత్, ప్రశాంతఃసుభగాకారో దైవజ్ఞశ్చ కవిర్భవే” దిత్యాది వచనోక్తగుణసంపన్నః స చ వివేకి వాచిక గాచి కార్థిక శిల్పక భూషణార్థి మార్దవానుగతాఖ్యాభి స్సప్తవిధః ......... 

వ్యాఖ్యానాంత్యభాగము :—

శ్లో. హంసీవ హంసకాం తంతర్వాణిహంససుమానసే
సేయం కవిశిరోభూషా దూషణారేః ప్రసాదతః

శ్లో. తుష్టో భవే ద్రఘుపతి ర్మయి సత్కృపావా
నేత న్మదీయవచనై రపి దుష్టభావైః
హృష్టో భవే ద్ధి సుతలాలనలాలసావాన్
లోకే పితా నిజశిశో ర్వచనై రపార్థైః.

శ్లో. మత్ప్రాణబంధౌ సుగుణైకసింధౌ
శ్రీరామచంద్రే పుషితార్యచంద్రే
లగ్నాకృతి స్సేయ మశేషకాలం
లోకే వసిష్ఠాం లభతాం ప్రతిష్ఠాం.

శ్లో. శ్రీరామాయ సమస్తదైవతశిఖారత్నాయ తే మంగళం
ఘోరాఘౌఘభిదాపటిష్ఠ మధురాఖ్యానాయ తే మంగళం
పారాతీత సమస్త సద్గుణగణాధారాయ తే మంగళం
వీరా యోద్ధృతచంద్రశేఖర ధనుస్సారాయ తే మంగళం.

శ్లో. దుష్టేంద్రారిసమూహనీరదమహావాతాయ తే మంగళం
పుష్పారాత్యనుజన్మ పంకజసుహృజ్జాతాయ తే మంగళం
ఇష్టార్థప్రదచాతురీయుతకృపాశీతాయ తే మంగళం
శిష్టానుగ్రహకారిసద్గుణమణివ్రాతాయ తే మంగళం

ఉ. మంగళ మంగజాతరిపుమంజులమానసమధ్యవర్తికిన్
మంగళ మబ్జజప్రముఖ మానితదైవతచక్రవర్తికిన్
మంగళ మానతార్తికృదమంగళభంగదసాంకీర్తికిన్
మంగళ మాదిమూర్తికి ఘనప్రభమూర్తికి రామమూర్తికిన్.

సీ. ఏ శక్తిచే నట్టి దిట్టిది యనరాని
తేజంబు రూపమై తేజరిల్లె
నే మాయలానిచే నిది యసత్తయ్యును
సద్రీతి దృష్టిగోచరతఁ గాంచె
నే శక్తిచే జగం బిది పరిణామమై
నిగమాంతముల కెల్ల నెఱపనయ్యె
నే శక్తిమంతుచే నిజ్జగం బంతయుఁ
దలఁప వివర్తమై తెలియనయ్యె

గీ. నట్టి దంపతు లగసుతాహరహృదంబు
జాతభావితు లీమత్పరిణీతభక్తి
నాత్మశరణంబు గావున నధికకరుణ
నెంతయుఁ బ్రసిద్ధ మవనిఁ గావింతు రెపుడు.

సీ. పంటతామరకంటివంటకూఁతుకిమోవి
పంటి తీయని తేనె జంట తేఁటి
భూధరాపత్యంపు పుణ్యంపు హృదయంపు
చారు కాసారంపు సరసహంస
బుడుతచందురు మామ పువ్వుఁదాల్చు శిరంబు
నెసేయని మదిలోని బెసఁగుమాటు
ప్రాచీనశాస్త్రంపు బహుళోక్తిమర్మంబు
మహిమంపు బలుపెంపు మాయలాఁడు

గీ. గాలిబిడ్డని పాలింటి గగనతరువు
వేవెలుంగుల దొరచూలి వేల్పుగిడ్డి
నిడుద కురువర్ణములు రెండు నుడువువాఁడు
పురుషుఁ డొక్కఁడు మత్కృతిఁ బొదలఁజేయు.

చ. అగతనయాగిరీశ హృదయాంబుజహంస లఖండచిన్మయుల్
జగదవనక్రియాధిక విచక్షణ మానుష వేషసుందరుల్
నిగమశిఖావచోనిచయ నిశ్చితవైభవులైన దంపతుల్
మిగిలినకూర్మి మత్కృతి రమింతురుగాక సత్ప్రతిష్ఠగన్.

గీ కవిశిరోభూషణం బన్న కవు భయమున
జిహ్మగులు గొందు లింగుట చిత్రమేమి ?
కవిశిరోభూషణం బన్న కవు భయమున
జిహ్మగులు గొందు లింగుట నిద మరయు.

సీ. కర్కశతర్కవాక్తర్కనాకుంఠిత
విశదమేధావిధావిలసనంబు
ఫణిరాజఫక్కికా ప్రముఖశబ్దగ్రంథ
సారసర్వస్వవిజ్ఞానపటిమ
యుభయమీమాంసార్థ విభవానుసంధాన
బంధురమేధాధురంధరతయు
వల్మీకసంభవ వ్యాకృత్యలంక్రియా
కోశాదిపరిచిత కౌశలంబు

గీ. సరసకవితామహామార్గ సతతగమన
చతురిమయుఁ గల్గుపండిత జనులకెలమి
నెలవు కొనఁజేయు జగతిలో లలితసూక్తి
భూషణంబైన కవిశిరోభూషణంబు

కం. పోషించి మాధవార్యమ
నీషి నను౯ సంస్కృతాది నిర్మలభాషా

భాషి నొనర్చి త్రిలిఙ్గజ
భాషాసామ్రాజ్య పట్టభద్రుని జేసెన్॥

ఉ. ఆదిమభాషనన్ను ముదమందఁగఁజేసి మదీయమైత్రి సం
పాదనచేసి మత్కృపకుఁ బాత్రతడాసి జనుల్ మెలంగఁగా
రాదె త్రిలిఙ్గభాష కథరాఁగ మదీయదయానిరీక్షణా
సాధనదక్షులందఱు విచారణ సన్యులు లేరుగా కిలన్.

చం. అకుటిలకీర్తి నిర్మలత సంచితుఁ బ్రౌఢశపండితుం ప వే
ఱొకఁడగు శబ్దశాసనుఁ డహోయని నన్నన నీడు సేయుఁగాఁ
బ్రకటము సాహసంబు కవిరాజులకెల్లను బెట్టు లన్నఁదా
వికృతికి మూలమై యతఁడు విశ్రుతవక్రసమాఖ్యఁ గాంచఁడే.

ఉ. గాదిలి నన్నభట్టన వికారపుఁబేరిడి కూడదంచు లో
నాదరణంబు మానక మహామహులార! గుణాగ్రహైకద
త్తాదరులార! యాదర సహాయులరో మఁ గనుంగొనుండు స
మ్మోదవిధానసాధన మపూర్వము మద్రచితంపుశక్కిఁకన్.

ఉ. వేరనలేదు ధారుణిశవీనతరాంధ్ర కవిత్వసంపదా
ధారరసజ్ఞులైన కవితల్లజులైన వినుండు; పండితీ
పారగులార! యోపరమబాంధవులార! తడ మశబ్ద సం
భారము పారముం దెలియఁ బాల్పడనేన సుఁడీ జగంబునన్.

కం. గట్టిగ నభినవనన్నయ
భట్టాచార్యాభిధాన పటుబిరుదాంకం
బిట్టిట్టనక వహించిన
దిట్టను ననుఁబోలఁగల సునీముఁడు లేఁడే?

శా. దాక్షీపుత్త్రిఫణీశముఖ్య కృతులందప్పంచు నొక్కొక్కచో
నాక్షేపింపఁగఁ జాలువారలకు మీ కస్మత్కృతిం జూడఁగా
నాక్షేపంబులు పుట్టనేరవె? సునీహార్యత్వభావా! వినుం
డాక్షేపంబుకు దన్నిరాకృతియు నీయుంచన్మనీషాగతుల్.

క. వేల్పులకు మాఱు వేల్పుల
వేల్పులఁ జేసికిని మాఱు వేల్పులఁ జేసిన్
గల్పింతు ననుచు నుండఁగ
వేల్పులు మును లేఁగుదెంచి వినయోక్తుల చేన్. ౨౫౮

క. గురుశాపవంచితుండై
కరమరుగఁగ మాలఁ డయ్యెఁ గావున నితఁ డీ
సురపురి నుండఁగ నర్హుఁడె
పరికింపుము మౌనివర్య! పావనచర్యా! ౨౫౯

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౨౬౦

క. ఈ నరవరు సశరీరుం
గా నాకమునందు నిలుపఁ గలవాఁడ నటం
చే నందఱు వినఁ బల్కితిఁ
గాన మదీయోక్తి నిజముగా నిర్వహిశన్. ౨౬౧

శా. ఏ కల్పించిన నాకమందు ప్రమదం బేపారఁగాఁ దారకా
నీకాభ్యంతరసీమ నూర్ధ్వపదవిన్ నిర్నిద్రుఁడై యీతఁ డ
స్తోకప్రాభవుఁడై యధోగతశిరస్కుండై యురేఁడైన యీ
లోకంబుల్ గల యన్నియేఁడులు సుశీలుండై సుఖంబుండెడున్. ౨౬౨

గీ. అనిన నతఁ డట్టులుండుట కాత్మలోన
ననుమతించుచుఁ దదనుగ్రహంబుఁ బొగడి
యమ్మహాత్ముని వీడ్కొని హర్ష మెసఁగ
మునులు సురలు నిజస్థానములకుఁ జనిరి. ౨౬౩

వ. అంత. ౨౬౪

గీ. అనఘుఁ డా కౌశికుండు నిజాశ్రమస్థ
మౌనులను గాంచి యిచట సమ్మర్ద మింకఁ
గలుగు నెట్లైన మన మరుగంగవలయు
ననుచు నచ్చోటు వెలువడి యతిరయమున. ౨౬౫

క. రమణీయ విశాలానగ
రమునం జెలువారు పుష్కరక్షేత్రమునన్
శమదమయుతవినుతంబగు
సమధికనిష్ఠం గొని తపము సలుపుచు నుండెన్. ౨౬౬

వ. అనంతరంబ. ౨౬౭

సీ. ధర్మశీలుం డయోధ్యానాథుఁడగు నంబ
రీషుండు మఖ మొనరించుచుండ
నాక్రతుపశువు జంభారాతి ద్రుచ్చిలె
నప్పుడా నృపుఁగని యాజకుండు
పలికె నిట్లు నరేశ పటుమదంబున నీవు
పశువు నేమఱియుంటి పశువు లేక
యున్న ప్రాయశ్చిత్త మొగిఁ జేయఁదగు నొండె
పశువును గొనక నరుఁ బశువుఁ జేసి

గీ. యాగ మొనరింపవలయు నీ యధ్వరమున
కంతరాయంబు గల్గిన యాగకర్త
కెడయుఁగావున నధ్వరం బెడయకుండఁ
బశువు వేవేగఁ దెప్పింపు పార్థివేంద్ర. ౨౬౮

వ. అనిన నమ్మహీశ్వరుండు పుత్త్రకళత్రపరిజనసమేతుండై సత్వరంబుగా
నగరంబు వెలువడి పురగిరిసరిత్సరిద్గుహాగహనవాపీకూపతటాకవల్మీక
గోష్ఠాదిప్రదేశంబుల నన్వేషించి, యెందునుంగానక చింతాకులమాన
సుండై చనుదెంచి, యొక్కయెడ ఋచికుండను మహాత్మునిం జూచి,
యతని కిట్లనియె. ౨౬౯

గీ. క్రతుపశువు నెల్లచోటులఁ గలయ వెదకి
కానలేనైతిఁ గాన నీ సూను నొకని
పశువుగా నిమ్ము దీనికిఁ బ్రతిగ నీకు
లక్ష గోవుల నిచ్చెద నీక్షణమున, ౨౭౦

వ. అనవుడు. ౨౨౧

క. జనకుం డగ్రతనూజుని
జనని కనిష్ఠాత్మభవుని చన నియ్య మటం
చును జెప్పిరి ముందుగ న
త్తనయులు తమ కిష్టులగుట తగ వాకిడచున్. ౨౨౨

క. జననీజనకులపల్కులు
విని మధ్యమపుత్త్రు నన్ను విడిచిరి సీరల్
జనవలసె పనుపునై నే
ననుచు శునశ్శేపుఁ డిట్టు లనె నానృపుతోన్. ౨౨౩

క. పెద్దకుమారుఁడు తండ్రికిఁ
దద్దప్రియుఁడు చిన్నకొడుకు తల్లికిఁ బ్రియుఁడై
యిద్దఱు వదలినవాఁడన్
మద్దైవముఁ జెపు వట్టుకేరు మానవనాథా! ౨౨౪

వ. అని మఱియు నిట్లనియె. ౨౨౫

గీ. నీవొసంగిన నన్నట్టి గోవుల నిఁక
వీరలకు నిమ్ము చిన్న నద్దావనీశ
వత్తుఁ జూ లక్ష గోవులు వారి కిచ్చి
యతని రథమున నిడికొని హర్ష మెసఁగ. ౨౨౬

వ. సత్వరంబుగాఁ జనుదెంచి, పుష్కరక్షేత్రంబున విడిసియున్న సముదుం
బున నచ్చటఁ దపోనిష్ఠాగరిష్ఠుండై యున్న గాధేయు సమీపంబునకుం
జని, శునశ్శేపుం డతివినయంబున దండప్రణామంబు లాచరించి, దీన
వదనుండై యతని కిట్లనియె. ౨౨౭

క. మా తండ్రి పెద్దకొమరుని
మా తల్లియుఁ జిన్నసుతుని మక్కువఁ గని యా
రీతి నను నంబరీషున
కాతత మఖపశువుగాఁగ నమ్మిరి మౌనీ! ౨౨౮

క. కలుషాత్ములు వారెక్కడి
తలిదండ్రులు నాకు నీవ తలిదండ్రివి కే
వలవిధివి నృపతిమఖమున
ఫలమొసరిచి నన్నుఁ గరుణ బ్రతికింపఁగదే. ౨౪౯

క. అని దీనవృత్తి సభయుం
బనివారణ వేఁడుచున్న నల్లుని భీతా
త్ముని నాదరించి కౌశిక
ముని తన సూనులను జూచి ముదమునఁ బలికెన్. ౨౫౦

సీ. తనుభవులార ! యిమ్మునికుమారుఁడు నాకు
నల్లుండు శరణార్థి యయ్యెఁ గాన
మీలోన నొకఁడు నెమ్మిని యాగసిద్ధికై
పశువయి బ్రతికింపవలయు నితని
భువిలోనఁ బురుషుండు పుత్త్రులఁ గాంచుట
పరలోకసౌఖ్యంబుఁ బడయఁగాదె
యితని మీరలు కృప నీక్షించి బ్రోచుట
పరలోక మిదె నాకుఁ బరమపదము

గీ. మఱియు నిది బంధుకృత్యం బమర్త్యవహ్ని
తర్పణంబును సభయప్రదాన మధ్వ
రావనంబును మద్వచనాదరంబు
గాన ధర్మంబు మీ కింతకంటెఁ గలదె. ౨౫౧

వ. అనిన వారు సమ్మతింపక తండ్రి కిట్లనిరి. ౨౫౨

క. త్రాతల మంచును నిజ తను
జాతులఁ దునుమాడి యన్యజన్ముల బ్రోవం
జూతురె యెవ్వారైనన్
దాతుడ (?)వీవైన నగుము తగ విప్పులుకుల్. ౨౫౩

వ. అని పలుకుచున్న నిజనందనులం జూచి కోపించి మద్వచనాతిక్రమ
ణంబు చేసితిరి గావున, మీరింక సహస్రవత్సరంబులు శునకమాంసంబు
భక్షించుచు, బహుదుఃఖంబులంబడి చరింపుఁడని శపించి, విశ్వామి
త్రుండు కరుణాసమేతుండై శునశ్శేఫునిం గాంచి యిట్లనియె. ౭౮౪

గీ. రెండు మంత్రంబు లిచ్చెద నిందు వేడ్క
వాని జపియింపఁగా భద్రమౌను నీకు
యాగఫల మబ్బు నరపతి కనుచు వాని
నిచ్చి పంచిన నతఁ డేఁగె మెచ్చు గులుక. ౭౮౫

చ. బలయుతుఁడైన రాజట విభావరిఁ బుచ్చి, ప్రభాతవేళఁ దా
నెలమి మఘప్రదేశమున కేఁగి మునీంద్రజు యూపమందు సొం
పలరఁగఁ గట్టి గంధకుసుమాదులచేఁ బశుపూజచేసి ని
శ్చలమతి యాజకోక్తుల వెసన్ విశసింపఁ దలంప నంతలోన్. ౭౮౬

మ. తాపసనాథసూనుఁడు యథావిధి నమ్మహనీయమంత్రముల్
వేఁబఠియింప నింద్రుఁడు నుపేంద్రుఁడు నాడకు వచ్చి వేడ్కచే
భూపతిఁ గాంచి, తత్సవనపూర్ణఫలంబు నొసంగి యాశున
శ్శేఫుని ప్రాణరక్షణము చేసి దివంబున కేఁగి రంతటన్. ౭౮౭

చ. అనఘుఁడు కౌశికుం డధికమైన తపంబు సహస్రవర్షముల్
ఘనతర నిష్ఠఁ జేయ నల కంజభవుండును నిర్జరుల్ రయం
బునఁ జనుదెంచి నీతపము పూజ్యమగున్ ఋషివైతి వంచు వేఁ
జన ముదమంద కెప్పటికిఁ జండతపం బతఁ డాచరింపఁగన్. ౭౮౮

ఉ. మీనవిలోచనంబులు సమిద్ధతటిల్లతికాభమైన నె
మ్మేను ప్రసూనగుచ్ఛముల మించు కుచంబులు నీలవేణి చం
ద్రానన ముల్లసత్కటి సమంచితహాసముఁ గల్గి వెల్గు న
మ్మేనక వచ్చి చెంగట గమింపఁగఁ గన్గొని మోహితాత్ముఁడై. ౭౮౯

ఉ. చేడియ నామనంబుఁ జొరఁ జిత్తభవుండు శరంబు లేయుచు
న్నాఁడు రతిప్రసంగముల నాకు ముదం బొనరింపు మంచుఁ బూఁ

బోఁడినిగూడి కోరికలు పూర్ణములై వెలయన్ దశాబ్దముల్
క్రీడ యొనర్చి, యాత్మఁ బరికించి ఘనంబగు తెల్విఁ గాంచుచున్. ౭౯౦

క. ఈ నెపమున నాతపమున్
మానుపఁ దలపోసి సురలు మానితయగు ని
మ్మానినిఁ బంపి రటంచును
మానిని నమ్మగువఁ బంచె మగుడన్ దివికిన్. ౭౯౧

క. పంచి విజితేంద్రియుఁడనై
పంచాస్త్రు జయింతు ననుచు భావించి హిమా
భ్యంచితశైలము వెనుకన్
వంచనలేకుండఁ దపము వర్ధిలఁ జేసెన్. ౭౯౨

వ. అట్లు కౌశికీతీరంబునందు. ౭౯౩

ఉ. ఘోరతపంబుఁ జేయఁ గనుఁగొంచు సురల్ భయసంవృతాత్ములై
నీరజగర్భుఁ గాంచి యిఁక నీవు మహర్షివసంగఁ గౌశికుం
డారయ నర్హుఁడన్న నటులయ్యెడు నంచు నతండు గాధిజుం
జేరి మహర్షివైతి వనఁ జెచ్చెర ధాతకు నాతఁ డిట్లనెన్. ౭౯౪

క. నను బ్రహ్మర్షి వటంచున్
బనివడి తథ్యముగ నీవు పలికి దాఁకన్
ఘనదీక్షఁ దపముఁ జేసెద
దినకరతేజోగరిష్ఠ! దేవజ్యేష్ఠా! ౭౯౫

క. అన విని యాఁగాక యటం
చును బంకజసంభవుండు సురలాత్మనివే
శనములకు నరుగ వెండియు
ఘనమాత్సర్యంబుతోడఁ గౌశికుఁ డచలన్. ౭౯౬

సీ. అతినిష్ఠ చే నిరాహారుండు నూర్ధ్వబా
హుండునై శీతున నుదకములను

వేసవులను బంచవీతిహోత్రులమధ్య
మునను ప్రావృట్కాలమునను బయట
నుండి వెయ్యేడు లత్యుగ్రమాతప మొన
రింపఁగా నంత నిలింపవిభుఁడు
రంభను గాంచి యోరామ నిర్జరహిత
కార్యంబుఁ జేయంగఁ గడఁక నరిగి

గీ. కౌశికుఁ డొనర్చు తప మంత గాసిచేసి
రమ్మనఁగ నన్ను శపియించు నమ్మునీంద్రుఁ
డధికరోషాత్ముఁ డచటికే నరుగ వెఱతు
ననినఁ గ్రమ్మఱ దానికిట్లనియె నతఁడు. ౨౪౨

క. నీ కింత వెఱవ నేటికిఁ
బ్రాకటముగఁ దోడునీకుఁ బంచెద నానా
లోకజయకాముఁ గామున్
గోకిలముల వెనుక నేను గోరిక వత్తున్. ౨౪౩

వ. అనిపలికిన. ౨౪౪

సీ. రాకాశశాంకు నిరాకరించు మొగంబు
కలువరేకుల నేలు కన్నుదోయి
బింబికాఫలసన్నిభంబైన యధరంబు
ఘనమండలముఁబోలు కచభరంబు
కరికుంభముల మించు గబ్బిచన్బంతులు
గగనభాగము నెన్నఁదగిన నడుము
పల్లవశ్రీ ల్వెదచల్లు హస్తంబులు
సరసిజంబులఁ గేరు చరణయుగము

గీ. పరభృతంబుల వంచించు భాషణములు
నంచబోదల నిరసించు యానములును

కనకలతికోపమంబైన కాయ మలర
రంభ చనుదెంచెఁ గౌశికారామమునకు. ౫౦౦

వ. ఇట్లు చనుదెంచి. ౫౦౧

క. మకరాంకుఁడు సుమనస్సా
యకములు వడినేయు పికచయంబులు గూయన్
సకలజనమోహసంధా
యకమగు గానం బొనర్చు చండఁజెలింపన్. ౫౦౨

క. కనుఁగొని కౌశికుఁడు మనం
బునఁ గడుఁ దలపోసి మత్తపోభంగము దా
నొనరింపఁ నింద్రుఁ డనిచిన
ఘనగర్వముఁ బూనివచ్చెఁగద యిది యనుచున్. ౫౦౩

క. రోషానలదీప్తుండై
యోషామణిఁ జూచి దుర్గుణోపేతమహా
దోషా! పదివేలేడులు
పాషాణమ వగు మటంచు పరఁగ శపించెన్. ౫౦౪

గీ. అట్లు శపియించి శాపకాలాంత మగుటఁ
బడఁతి యొక విప్రువలన శాపంబు దొలఁగు
ననుచు వచియింపఁగా శిల యయ్యె రంభ
యట నిలవలేక సరగున నరిగె మరుఁడు. ౫౦౫

వ. అంత. ౫౦౬

సీ. తనతపం బటు కొంత దఱిఁగిన వగవక
యజుఁడు బ్రహ్మర్షి వీవైతి వనుచు
ననుఁ బల్కునందాఁక ఘననిష్ఠఁగైకొని
హానిమీఱ సహస్రహాయనములు

నిర్జితేంద్రియుఁడనై నిశ్చలచిత్తుండ
నై నిరాహారుండ నగుచు నుండి
యూర్పులు పుచ్చక యురుతపం బొనరింతు
ననుచు నుత్తరదిశ నపుడు విడిచి

గీ. తూర్పుదెసకు నేఁగి నేర్పుమీఱంగ సి
ద్ధాశ్రమ స్థలంబునందుఁ జేరి
వరుసతో సహస్రవత్సరంబులు నిండ
నుగ్రతప మొనర్చి యొక్కనాఁడు. ౧౦౭

క. పారణఁ జేయఁదలంచిన
వారిదవాహనుఁడు విప్రవరుఁడై దన కా
హారము వేఁడిన ముద మే
పారఁగ నిడ నన్న మంత యతఁడు భుజించెన్. ౧౦౮

వ. అనంతరంబ. ౧౦౯

ఉ. పాయని నిష్ఠఁ గౌశికుఁ డపారతపంబు సహస్రవర్షముల్
చేయుచునుండ మూర్ధమునఁ జిత్రకరాతిభయంకరాగ్నికీ
లాయుతసాంద్రధూమనికరంబులు వెల్వడి విక్సమూహమై
హాయనగహ్వరీ ఘనతరాంతర మంతయు నాక్రమింపఁగన్. ౧౧౦

క. నక్షత్రంబులు రాలెను
సక్షోభములయ్యె సప్తజలధులు జగముల్
విక్షేపించెను మిడుఁగురు
లక్షీణములగుచుఁ బర్వ నశనులు వడియెన్. ౧౧౧

క. నగములు తావులు దప్పెను
ఖగములు మృగములును బన్నగంబులు సోలెన్
వెగడొందె దివిజవర్గము
గగనము మొఱవెట్టె ధరణి కంపముఁ జెందెన్. ౧౧౨

గీ. అపుడు సురముని గంధర్వ లబ్జభవుని
కడకు వెసనేఁగి తత్పాదకమలములకు

భక్తిచే మ్రొక్కి మావిన్నపంబు లింకఁ
గరుణఁ గైకొనుమని చెప్పఁగడఁగి రిట్లు. ౪౧౩

శా. విశ్వామిత్రుఁడు బ్రహ్మమా తపముఁ గావింపంగఁబూనెఁ; మరా
శాశ్వా! యిమ్మిఁక నమ్మహామునికి బ్రహ్మర్షిత్వ మైనన్ మహా
శశ్వద్దైవభవశాలి బ్రహ్మపురరాజ్యంబైన నీవేని నీ
విశ్వంబుల్ దెగుఁ దత్తపోనిలసఖావిఖ్యాతకీలాలిచేన్. ౪౧౪

గీ. అనినఁ బద్మజుండు మునిసురయుక్తుఁడై
వచ్చి గాధితనయు నిచ్చఁ జూచి
పటుతపోబలమున బ్రహ్మర్షి వైతి
విట్టి ఘోరతప మిఁకేల యనుచు. ౪౧౫

వ. కౌశికుండు వాగీశున కిట్లనియె. ౪౧౬

గీ. బ్రహ్మసంభవుండు బ్రహ్మర్షివరుఁడగు
నవ్వసిష్ఠుఁ డిచటి కరుగుదెంచి
పరఁగ నన్నుఁ గాంచి బ్రహ్మర్షి వైతి వీ
వనక నమ్మనేర నయ్య జియ్య! ౪౧౭

వ. అనిన విని బ్రహ్మాదిదేవత లవ్వసిష్ఠమునీంద్రునిం బిలిపించిన, ౪౧౮

ఉత్సాహ. తర్షియై వసిష్ఠుఁ డటకుఁ దరలివచ్చి గాధిజున్
హర్షమొప్పఁ గని తపోమహత్త్వమునకు నీవు బ్ర
హ్మర్షివైతి వింక సందియంబు మాను మన జితా
మర్షుఁడగుచుఁ గౌశికుం డమందనందితాత్ముఁడై. ౪౧౯

క. ఘనుఁడైన వసిష్ఠుని పద
వనజయుగంబునకు భక్తి వందన మిడి పూ
జన మొనరించి నుతించెన్
జని రంతట నెలమి సరసిజభవముఖసురుల్. ౪౨౦

వ. అనిచెప్పి, శతానందుండు వెండియు నిట్లనియె. ౪౨౧

గీ. తపముబల్మిని గాధిసంతతి సలిపిన
కార్యములు చెప్పఁగా ననేకములు గలవు
రూఢిగా నెన్న హరియొ హరుండొ కాక
యతఁడు కేవలమానిసే యినకులేంద్ర! ౧౨౨

క. అని చెప్పిన దాశరథులు
జనకుం డచ్చోటనున్న జనులున్ మునులున్
విని మనముల నరుదందుచు
వినుతించిరి ఘనచరిత్రు విశ్వామిత్రున్. ౧౨౩

వ. అంత రామచంద్రుండు శతానందున కిట్లనియె. ౧౨౪

క. అందమ్మగుపేర శతా
నందుఁడ వతివిశదవాగ్గణంబులను శతా
నందుఁడవు పరబ్రహ్మా
నందుఁడ వీ వక్షపాదనందన! తలఁపన్. ౧౨౫

వ. అని యనేకవిధంబుల వినుతించుచున్నయవసరంబున సరోజబాంధవుం డస్తగిరిమస్తకాంతరితుం డగుటయు నారాత్రి చనిన మఱునాఁడు కౌశికమునీంద్రుండు కాలోచితంబులు దీర్చి రామలక్ష్మణసమేతుండై జనకమందిరంబున కరిగి జనకకృతసత్కారసంతుష్టమానసుండై జనకున కిట్లనియె. ౧౨౬

గీ. జనకభూపాల! నీయింటఁ దనరుచున్న
రాజశేఖరచాప మీ రాజసుతులు
గనుఁగొనెడు వేడ్కఁ వచ్చిరి గాన నిటకు
సరగఁ దెప్పింపు మావిల్లు జనులచేత. ౧౨౭

వ. అనిన జనకుండిట్లనియె. ౧౨౮

క. శివునకు దక్షాధ్వరమున
సవభాగము లొసఁగకున్న శంకరుఁడు మహా
హవమున నీధను వందుచు
దివిజావలిఁ బాఱఁ ద్రోలెఁ దీవ్రాస్త్రములన్. ౧౨౯

క. అంతట గీర్వాణు లుమా
కాంతుని శరణంబువేఁడఁ గరుణాయుతుఁడై
శాంతిఁగని సురలకెల్లను
గంతుహరుం డభయమొసఁగె ఘనమోదమునన్. ౧౩౦

వ. తదనంతరంబ. ౧౩౧

సీ. అనఘ మత్పూర్వుఁడగు దేవరాతున
కిచ్చె నీకోదండ మిందుధరుఁడు
నాఁడాదిగా మునినాథ యీచాపంబు
మాయింటనుండు సన్మాన్యలీలఁ
గ్రతుభూతలంబు నాఁగట నేను దున్నుచు
నుండంగ నందొక్క యువిద పుట్టె
సీతాంతరంబునఁ జెలువ జన్మించుట
సీతాభిధానంబు చేసి తనయ

గీ. గాఁగఁ బెంచితిఁ బరిణయకాల మగుడు
శంకరశరాస మెక్కిడఁజాలువాని
కిత్తు నాకూఁతునని యెల్లయెడలఁ జాటఁ
బంచినాఁడ స్వయంవరం బంచితముగ. ౧౩౨

శా. ఆవార్తల్విని రాజనందనులు నెయ్యంబొప్ప నీప్రోలికిన్
వేవేగన్ జనుదెంచి బాహుబలమున్ వీర్యంబు శోభిల్లఁగా
నా విల్లంది కదల్పలేక మదిలో నాశ్చర్యమే పారఁగాఁ
బోవం జొచ్చిరి వారిదేశములకున్ బుణ్యాత్మ! లజ్జించుచున్. ౧౩౩

ఉ. కొందఱు మేదినీపతులకుంఠితవిక్రమ మొప్ప వారణ
స్యందనవాజిసద్భటచయంబులతోఁ జనుదెంచి నేను మె
చ్చం దగఁ జాప మెక్కిడఁగఁజాలక యాలము సేయఁబూని నా
ముందఱ నిల్వలేక బలముల్ చెడిపోయిరి వచ్చుత్రోవలన్. ౧౩౪

ముత్కరుఁ డీరాముఁడు శశి
భృత్కోదండంబు నెక్కు వెట్టిన నిపుడే
మత్కన్య నితని కిచ్చెద
సత్కర్మములు నన్ను సత్యశాలి యనంగన్. ౧౩౫

వ. అనిచెప్పి జనకనృపాలుండు శరాసనంబుఁదగువారిం బనిచి తెప్పించి
సభాతలంబునందుఁ బెట్టించి, విశ్వామిత్రున కిట్లనియె. ౧౩౬

గీ. గరుడగంధర్వయక్షరాక్షసులకైన
నమరులకునైన దుర్భరంబైన యీ శ
రాసనం బెత్త మనుజుల కలవియగునె
మైన రాఘవులకుఁ జూపు మనఘ ! దీని. ౧౩౭

వ. అనిన విని కౌశికమునీంద్రుండు రామభద్రున కిట్లనియె. ౧౩౮

గీ. దశరథాత్మజ యిటు చూడు దండహస్త
చండదీప్తమయఖండనోద్దండఖండ
పరశుకోదండ మిది దీని బలిమి నెత్తి
యెక్కువెట్టుము ఘనకీర్తి దక్కు నీకు. ౧౩౯

చ. అని ముని పల్క, రాముఁడు శరాసనముంగని చేరి దానిపైఁ
దనరుచునున్న కప్పు ప్రమదం బొదవన్ వెడలించి ధాత్రి న
ద్ధనువిడి నారిఁగూర్చి సుకృతంబగుముష్టిని బట్టి యెత్తి లీ
లను దెగఁదీయఁగా విరిగె లస్తకసీమను విల్లు గొబ్బునన్. ౧౪౦

సీ. పుండరీకాక్షుండు చండధామాన్వయ
మండనుండగు రాఘవుండు సభను
ఖండేందుధరునికోదండంబు నడిమికి
ఖండించి తనదైన గండుఁ జూపు
చుండఁ గార్ముక మహోద్దండనిర్ఘోషంబు
మెండుగా బ్రహ్మాండభాండమెల్ల
నిండంగ నిద్ధరామండలంబు వడంకెఁ
గొండలు గదలె నక్కుండలపతి

గీ. బెంకుపడె దేవదైత్యుల గుండె లవిసెఁ
గాండనిధులు గలంగె మార్తాండసోమ
మండలము లధ్వముల్ దప్పియుండె ఋక్ష
కాండములు రాలె వడగళ్లపిండులట్లు. ౮౪౧

గీ. అమ్మహారావ మాలించి యధికసత్వ
రాజితుండైన జనకధరావిభుండు
కౌశికుండును రామలక్ష్మణులుదక్క-
నెల్లవారలు సభను మూర్ఛిల్లి రపుడు. ౮౪౨

వ. అంత ముహూర్తమాత్రంబునకుఁ దెలివినొందిన డెందంబులందలరారు
సభాసదులు తమలోన. ౮౪౩

సీ. శివుని కార్ముక మెత్తి యవలీల విరువంగ
శివునంతవానికిఁ జెల్లుఁగాక
యన్యుల వశమౌనె యనువారు రాజశే
ఖరు విల్లు రాజశేఖరుఁడు విఱిచె
చిత్ర మేమనువారు చేరిమహాబలుం
డతిసమర్థత చే శరాసనంబు
విదళించునట్టు లివ్వేళ మహాబలుం
డగు సీతఁజెలమి శరాసనంబు

గీ. శకలములుచేసె మునుపున్న సరణిగాదె
యనెడువారు మహాసాధ్య మనెడువారు
హరిపరాక్రముఁ డీరాముఁ డనెడువారు
పూరుషోత్తముఁ డితఁ డనువార లైరి. ౮౪౪

వ. ఇట్లనేకు లనేకవిధంబుల రామభద్రుం బ్రశంసించుచున్న విని జనక
మహీశుండు కౌశికమునీంద్రున కిట్లనియె. ౮౪౫

ఉ. ఓమునినాథ! నీకృప మహోన్నతభాగ్యము నేఁడు గల్గె నీ
రాముని విక్రమంబు మది రంజిలఁ గంటిని నామనోరథం
బీమనుజేంద్రు నల్లునిగ నిప్పుడు గైకొన నొప్పు దేవతా
స్తోమము మెచ్చ నాకులుకు సూనృతమై యలరారు నిమ్మహిన్. ౮౪౬

చ. అన విని కౌశికుండు ముదమందిన డెందముతోడ నాతనిం
గనుఁగొని యిట్లు పల్కె; జనకక్షితిపాలక! నీదు వాక్యముల్
వినఁదగుఁ బెండ్లియత్న మిఁక వేగము సేయుము నీతనూజకుం
బెనిమిటి రాఘవుండగుటఁ బెంపువహించు భవద్యశం బిలన్. ౧౪౭

క. నారాయణుండు దుగ్ధాం
భోరాశికి నల్లుఁడైన పోలుపున ధరలో
నీరాముఁడు నీయల్లుం
డై రాజిల నీదుభాగ్య మభినుతికెక్కున్. ౧౪౮

క. అని ముని పల్కిన వినుచును
జనకుం డెద ముదము గదియ సచివులఁ గనుచున్
ఘనులార మీ రయోధ్యకుఁ
జని దశరథుఁ గాంచి వినయచాతురి మెఱయన్. ౧౪౯

గీ. తగిన మాట లాడి తనయుల పెండ్లికిఁ
దర్లిరం డటంచు దశరథేశుఁ
బిలువ నేఁగుఁ డనినఁ జెలఁగుచు సరగ న
యోధ్యకరిగి మంత్రు లుచితగతిని. ౧౫౦

వ. దశరథేశ్వరుఁ బొడగని యిట్లనిరి. ౧౫౧

చ. జనకనృపాలుఁ డంపినవెసం జనుదెంచితిమయ్య వేడ్కన
మ్మనుజవరేణ్య మంత్రులము మావచనంబు లతండు పల్కుచొ
ప్పున మది నెంచఁగా వలయు భూరిశుభం బొనగూడు మీకుఁ గొ
బ్బున నెఱిఁగింతు మవ్విధముఁ బొందుగ భాస్కరవంశవర్ధనా! ౧౫౨

సీ. దశరథేశ్వర నీదు తనయులు రామల
క్ష్మణులు విశ్వామిత్ర మౌనివెనుకఁ
జనుదెంచి పెక్కండ్ర దనుజులఁ బరిమార్చి
కౌశికసవనంబు గాచి పిదప

గౌతమముని జన్మగ్రామణీ భామినీ
శాపంబు దొలఁగించి జనకనృపతి
యొనరించు యాగంబు గనుఁగొన మిథిలకు
నేతెంచి యచ్చట భూతనాథు

గీ. విల్లు రాముండు నిజ భుజవీర్యమునను
విరువ జనకమహీశుఁ డవ్వేళ మిగుల
సంతసించుచు సుతను భూజాత పూత
సీత రామునిజాయఁగాఁ జేయఁ దలఁచె. ౧౫౩

క. అటు దలఁచి నెమ్మది మహో
త్కట సంతోషమునఁ బొంగి కౌశికమునితోఁ
బటుమతిఁ జెప్పఁగ శుభ మిటు
ఘటియిల్లు నటంచుఁ బల్కెఁ గరుణ న్మునియున్. ౧౫౪

వ. అట్లగుటం జేసి, ౧౫౫

క. వేవేగ మిమ్ముఁ దోడ్కొని
రావలయు నటంచు మమ్ము రహి నజ్జనక
క్ష్మావరుఁడు పనిచెఁ గావున
భూవర విచ్చేయవలయుఁ బొలుపుగ నటకున్. ౧౫౬

మ. అని చెప్పంగ నజాత్మసంభవుఁ డమందానందచేతస్కుఁడై
జనకక్ష్మావిభుమంత్రిముఖ్యులకు విస్తారాంబరంబుల్ మణుల్
కనకంబుల్ దగనిచ్చి రాఘవుల సత్కల్యాణవార్తన్ బురం
బునఁ జాటించిన నింపుఁ బౌరనికరంబుల్ సంతసిల్లెన్ గడున్. ౧౫౭

వ. అంత దశరథమహీకాంతుండు పురాలంకరణంబు సేయించి దివ్యాంబరాభరణంబులు ధరించిన వసిష్ఠ వామదేవకశ్యపమార్కండేయ కాత్యాయనాత్రి జాబాలి ప్రముఖమహామునులును, సుమంత్రాది మంత్రులునుం బరివేష్టింప, భూసురాశీర్వాదనాదంబులు సెలంగ, నపరిమితోత్సాహంబునఁ బుణ్యాంగనాసముదయంబులు పౌరజనంబులతోడ నేతేర, మిథిలాపురప్రయాణోన్ముఖుఁ డగుటయు, ౧౫౮

గీ. కనకమణిభూషణాఢ్యులు కాయములను
నిండ, ముత్తెంపు గొడుగులనీడ లమర,
భరత శత్రుఘ్ను లురుతరభద్రగజము
లెక్కివచ్చిరి తండ్రికి నింపుమిగుల. ౪౫౯

సీ. ఘనతర నిస్సాణ కాహళభేరికా
వరమృదంగధ్వనుల్ వఱలుచుండ
వైణికగాయకవాంశికాదులు కను
సైఁగలచతురతల్ సారెఁ దెలుప
వారకాంతామణీవర్గంబు నర్తన
గానచాతుర్యముల్ పూని నడువ
వంది మాగధ సూత బృందంబు లిరువంక
లందుండి సన్నుతు లాచరింప

గీ. గజతురంగశతాంగసంఘములఁ గూడి
భటులు నిశితాయుధంబులు పట్టి కొలువ
ఛత్రచామరముఖ్య లాంఛనము లలరఁ
బురము వెలువడె నా రాజపుంగవుండు. ౪౬౦

వ. ఇట్లయోధ్యాపురంబు నిర్గమించి, సపరివారుండగు నాదశరథేశ్వరుండు మార్గంబులఁ బురంబులు విపినంబులు మహానదులాదిగాఁ గలుగు నవియెల్ల నతిక్రమించి, కతిపయప్రయాణంబుల విదేహనగరంబుఁ బ్రవేశించిన నవ్వార్త యెఱింగి యప్పుడు. ౪౬౧

క. ఎదురేఁగి జనకనరపతి
మది మోదము గదుర సజకుమారు నుతించెన్
మృదుతరభాషణములచేఁ
ద్రిదశేంద్రునిఁ బొగడు వరుణదేవునిమాడ్కిన్. ౪౬౨

గీ. సన్నుతించి యథావిధి సత్కరించి
ఘనవసిష్ఠాదిమునిజన గ్రామణులకు

వినతు లొనరించి వారి దీవనలు గాంచి
తగిన నెళవున విడియింపఁ దలఁచి యంత. ౧౬3

క. పిడిదలఁ జూపఁగఁ గనుఁగొని
వడివడి లెండనుచు భద్రవాద్యస్వనముల్
కడుఁ జెలఁగ దశరథుఁడుఁ బరు
వడి నచ్చటఁ జేరె సపరివారుం డగుచున్. ౧౬౪

వ. ఆసమయంబున. ౧౬౫

చ. కుశకులసంభవుండు ననఘుండగు గాధిసుతుండు వేడ్కనా
దశరథుఁ జూడఁగోరి వితతప్రభులన్ జనమాన్యులన్ మహా
యశులను రామలక్ష్మణుల నర్మిలిఁ గైకొని రాఁగ నాతఁడున్
భృశవినయంబునన్ మునివరేణ్యునిపాదము లంటి మ్రొక్కుచున్. ౧౬౬

క. మునివర నీకారుణ్యము
నను శుభములఁ గంటి ధరణినాథ స్తవముల్
గొనఁదగు కీర్తులఁగంటిని
నిను వినుతింపంగ నేర్తునే ధీరమణీ. ౧౬౭

చ. అని పలుకంగ మౌని ముదమందుచు దీవనలిచ్చి వంశపా
వన వినుమ; నీకు ధాత్రి సరివత్తురె పార్థివులంచుఁ బల్కి స
య్యనఁగని రామలక్ష్మణుల నయ్యకు మ్రొక్కుఁడటంచుఁ దెల్పఁగా
వినయముతోడ వారు పృథివీపతికిన్ దగ మ్రొక్కి నిల్చినన్. ౧౬౮

క. నందనులఁ గౌఁగిలించి య
మందానందంబుతోడ మనుజేంద్రుఁడు సం
క్రందనతుల్యుఁడు వారల
నందుగ దీవించె నంత నాతనితోడన్. ౧౬౯

గీ. కౌశికుఁడు పల్కునాదుయాగంబుఁ బ్రోచి
దివిజు లభినుతిసేయంగఁ దేజరిల్లి

జనకుఁడొనరించు సవనంబు సరవిఁజూడ
నరుగుదెంచిరి నీసుతు లవనినాథ. ౮౭౦

ఉ. రాముని విక్రమంబు సచరాచరమైన జగంబులో మహో
ద్దామ మటంచు నెన్నఁదగె ధర్మగుణాన్వితు సాధురక్షకున్
శ్రీమహితాంగు సన్నుతవిశేషచరిత్రుని నిర్మలాత్మునిన్
రామునిఁ బుత్త్రుఁగాఁబడసి రంజిలుచుంటివి వైభవంబునన్. ౮౭౧

క. సత్యవచనంబు దప్పక
నిత్యము బుధవినుతిఁగాంచి నెగడెదు ధరణీ
పత్యవతంసమ భవదా
న్నత్యముఁ బొగడంగవశమె నలువకునైనన్. ౮౭౨

క. అనిపలుక నంత జనకుం
డినకులవల్లభునిఁ జూచి యిట్లను నృప నీ
ఘనతరసంబంధము నా
మన మలర ఘటిల్లె నేఁడు మద్భాగ్యమునన్. ౮౭3

గీ. అనుచు జనకనృపాలుండు వినయరీతిఁ
బలుకు నమ్మాట కలరుచుఁ బంక్తిరథుఁడు
వినుము నరపాల నీవు నావియ్యమగుట
నామహోన్నతి జగతి నెన్నంగవశమె. ౮౭౪

చ. అనివచియింప వించు జనకావనిపాలకుఁ డా నృపాలు వీ
డ్కొని తనమందిరంబునకు గొబ్బున నేఁగి యమాత్యవర్గమున్
గనుఁగొని పెండ్లియత్నమిఁక గ్రక్కున సేయవలెంగదా యటం
చును దగనాడ నీమతముచొప్పున యత్నములయ్యె నన్నియున్ ౮౭౫

వ. అనిచెప్పిన సంతోషించి, యమ్మఱునాఁడు జనకభూపాలుండు సకల జనంబులు పరివేష్టింప సభాస్థితుండై మంత్రులంగనుంగొని దశరథేశ్వరుం దోడ్కొని రండని పంచిన వార లరిగి ప్రభాకరవంశరత్నాకరచంద్రుఁడగు నమ్మానవేంద్రునింగని, జనకవచనప్రకారం బెఱింగిం

చిన సతండు వసిష్ఠాదిమహామునులును పుత్త్రమిత్త్రామాత్యాది జనంబులును గొలువ నేతెంచి జనకునియాస్థానంబునఁ బ్రవేశించిన వారల కందఱకు నుచితసత్కారంబులు గావించి సముచితాసనంబులఁ గూర్చుండనియమించి, యానందభరితమానసుండై జనకుండు దశరథున కిట్లనియె. ౧౭౬

గీ. నరగఁ బెండ్లి కి లగ్ననిశ్చయముఁ జేయ
వలయు మీరింకఁ బెద్దలవలనఁ దెలిసి
యనిన ముదమంది యర్కవంశాభిరాముఁ
డగు నృపాలుండు జనకున కనియె నిట్లు. ౧౭౭

క. నరపాలక విను మస్మద
భిరతుల్ సుమతుల్ వసిష్ఠవిశ్వామిత్రుల్
గురుతరతపోధనుల్ ముని
వరు లేతత్కార్యభారవాహకులుగదా ! ౧౭౮

వ కావున వీరలు సకలప్రయోజనంబులు నిర్వహింపంగలవారని పల్కి, దశస్యందనుండు వసిష్ఠవిశ్వామిత్రుల కిట్లనియె. ౧౭౯

సీ. మునివర్యులార ! రాముని వివాహము తోడఁ
దక్కిన మువ్వురు తనయులకును
బరిణయంబులు సేయ భావించితిని గాన
మీమనంబుల నిట్టిమేలు దలఁచి
జనకనందన యూర్మిళను లక్ష్మణునకును
వరగుణుండగు కుశధ్వజుని సుతల
భరతశత్రుఘ్నుల కిరవొంద నిమ్మని
జనకభూపాలుని సరవి నడుగుఁ

గీ. డనిన వా రట్ల యగునని యడుగ జనకుఁ
డాత్మ నెంతయు సంతోషమంది యట్లు

నాతనూజుల నోసఁగెద నాఁగ, వినుచుఁ
బఙ్క్తిరథుఁడాత్మ సంతసంబడియె నంత. ౧౧౦

క. అమ్మునివరు లాత్మల యం
దిమ్ములఁ బరికించి విబుధులెన్నఁగ శుభల
గ్నమ్మొకటి నిశ్చయించిరి
యమ్మనుజాధిపులు మిగుల హర్షింపంగన్. ౧౧౧

వ. అంత దశరథేశ్వరుండు జనకమహీపాలు వీడ్కొని, సపరివారుండై విడిదల కరిగి స్నానసంధ్యాద్యనుష్ఠానభోజనాదికరణీయంబులు సల్పుచు సుఖంబుండె; జనకుండును గొలువుచాలించి, యభ్యంతర మందిరంబున కరిగి, యథోచితప్రవర్తనుండయ్యె ననంతరంబ. ౧౧౨

గీ. కౌసలేయు వివాహంబుఁ గనఁగ మాకు
ననిమిషత్వంబు సార్థకంబగును రండ
టంచు దివిజులఁ బిలువంగ నరుగుకరణిఁ
దరణి యస్తాద్రిమరువున కరిగె నంత. ౧౧౩

క. శ్రీరామ పరిణయోత్సవ
మారూఢింజూడఁ దలఁచి యమరులు ముదమే
పారఁగ వెలిఁగించు మతా
బారీలని మింటఁ గుముదబంధుఁడు వొడమెన్. ౧౧౪

ఉ. ఆసమయంబునన్ మునికులాగ్రణియైన వసిష్ఠుఁ డర్మిలిన్
భాసురతేజుఁ బఙ్క్తిరథు భానుకులాగ్రణిఁ జూచి పల్కె నో
వాసవతుల్య! పుత్త్రులవివాహము లొప్పఁగఁజేయు మియ్యెడన్
డాసెను భద్రలగ్నమనినన్ మునిపల్కులు వించు నెమ్మితోన్. ౧౧౫

క. మునులున్ భూసురులున్ దన
తనయులు మిత్త్రులు సమాత్యతతులు పురగ్రీ
జన కవిగాయకభటులున్
దనతోఁ జనుదేర వెడలి దశరథుఁ డంతన్. ౧౧౬

సీ. వందిమాగధులు కైవారంబులొనరింపఁ
బౌరాంగనలు సేసఁబ్రాలఁ జల్ల
వారాంగనలు నాట్యవైఖరిఁ జెన్నొంద
భూసురాశీర్వచస్స్ఫూర్తు లమర
వేణువీణాశంఖవివిధధ్వనులు గ్రాలఁ
గరదీపికానీకకాంతు లడర
ముందటి కేతెంచి కొందఱు సుందరుల్
హాళిమీఱంగ నివాళు లిడఁగ
గీ. కాహళీభేరికా మృదంగ స్వనములు
మిన్నుముట్టంగ మేడల మెలఁగు రాజ
బింబవదనలు చూచి మోదంబుఁ జెందఁ
జెలఁగి వీథులయందు వేంచేయుఁదొడఁగె. ౧౧౭
గీ. బాణకారులు వేడ్కతో బార్లుదీర్చి
పరఁగ లంకాపురుల్ మతాబాలు చిచ్చు
బుడ్లు జువ్వలు గాల్పఁదద్భూరి రుచులఁ
బట్టపగలని తోఁచె నప్పట్టునందు. ౧౧౮
క. జువ్వలు గగనంబునకున్
రివ్వనఁ జని యచట విస్ఫులింగచయంబుల్
నివ్వటిలఁ జేయఁగా నవి
యవ్వేళను దార లనఁగ నగపడుచుండెన్. ౧౧౯
గీ. పౌరవీథులయం దిట్లు భద్రవైభ
వంబు దీపింప వేవేగ వచ్చివచ్చి
సకల జనములతో దశస్యందనుండు
జనకభవనంబు దరిఁజేరుసమయమునను. ౧౨౦
ఉ. అంగన లంతరంగములయందు ముదంబున పెంపుఁ జెంద సా
రంగగతిప్రచారములు రాజిలుభూషల మేను లొప్పఁగా

ముంగలి కేఁగుదెంచి తమముద్దుమొగంబులు తేటలూరఁగా
బంగరు పళ్లెరంబులను బట్టిరి చిత్రముగాఁగ నారతుల్. ౮౯౧

ఉ. ఆరతి యిచ్చువేళ నొకయంగన నల్లని కల్వరేకులన్
సారెకుఁ గేరుకన్నులను జక్కని బంగరుపళ్లెరంబుమేల్
తీరు గనంగ నం దమరు దీపము లోచనకాంతియుక్తమై
చారుసురేంద్రనీలమణి చందమునం గనుపట్టు వింతగన్. ౮౯౨

వ. అనంతరంబ. ౮౯౩

గీ. చారుసహకారపల్లవతోరణములఁ
దనరు పందిళ్లు ద్వారముల్ దాఁటి సరగఁ
బ్రకటహాటకరంగవల్లికలనొప్పు
గలుగు భవనాంగణమ్ములు గడచి చనుచు. ౮౯౪

క. పరిణయయోగ్య చతుర్మం
దిర మధ్యప్రాంగణంబు దివ్యాభరణాం
బరవనితాతతి నజ్జన
వరుఁడు ప్రవేశించె సపరివారుం డగుచున్. ౮౯౫

వ. అంత. ౮౯౬

క. మునివరుఁ డరుంధతీపతి
యినకులభవులైన మానవేంద్రుల క్రమముల్
ఘనతరతల్లక్షణములు
వినిపించెన్ సకలజనులు వేడుక నొందన్. ౮౯౭

సీ. మాసిత గుణుఁడు శతానందుఁ డంతట
జనకభూపాలు వంశక్రమంబు
నెమ్మిఁ జెప్పఁ దలంచి నిమిచక్రవర్తిమొ
దలుగాఁగ నాతని కులమునందుఁ
గలుగు రాజన్యులఁ గ్రమముగాఁ జెప్పుచు
వారి సత్యవినీత్యవార్యశౌర్య

ధైర్యసత్కీర్తి గాంభీర్యాదిగుణములు
దెల్పిన వినువా రనల్పగతిని

గీ. సంతసించుచునుండ నాజనకనృపతి
పెండ్లికొమరులకును దగు పెండ్లికాంతు
లకును మంగళస్నానములను ఘటింపుఁ
డనుచుఁ బుణ్యాంగనలఁ బల్కి వినుము వేగ. ౮౯౮

సీ. శ్రీకరకలిత చామీకరకంకణ
నాదముల్ చెవులకానందమొసఁగఁ
జనుదోయి భారంబు సైఁపని సన్నంపుఁ
గౌను లేఁదీఁగలు కంపమొందఁ
జెలువైన గబ్బిగుబ్బల పైనిఁదీగఁగాఁ
దారహారంబులు తాండవింపఁ
దమ్మిపై మకరందము జాలువాఱిన
మాడ్కి మోములను జెమ్మటలు జార

గీ. రాజమండలముఖులు శ్రీరామునకును
వసుమతీజకుఁ దక్కినవారలకును
బరిమళించుచునున్న సంపంగినూనె
తోడఁ దల లంటి రెవల సంతోష మొదవ. ౮౯౯

గీ. పిదపఁ గస్తూరితోడను మెదిచినట్టి
చందనంబులు మేనుల యందునలిచి
యలరు పన్నీట జలకంబు లాడఁజేసి
కురుల తడిమొత్తి క్రొమ్ముళుల్ గూర్చి మఱియు. ౯౦౦

క. తిలకములు దిద్ది చందన
మలఁది వరాంజనముదీర్చి హాటకరత్నో
జ్జ్వలభూషల నిడి యంబర
ములుగట్టి సుగంధమాల్యములువైచి రహిన్. ౯౦౧

వ. మఱియును బరిణయసమయోచితాలంకరణంబు లన్నియుం గావించి యున్నిమ్మంచుబోళ్ళు పెండ్లికొడుకులఁ బెండ్లికూఁతులం గై సేసితిమని జనకున కెఱింగించిన, నతండు ముదితుండై శతానందసహితుండగుచు మృగమదగంధబంధురంబును, విమలమౌక్తికరంగవల్లీవిరాజితంబును, సువర్ణమణిగణ రమణీయస్తంభాభిరామంబును, భద్రకుంభ శోభితంబును నవ్యభవ్యద్రవ్యభాసురంబును, సమస్తజనపరివృతంబును నగు వివాహవేదికం గనకాసనంబుల శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులం గూర్చుండం జేసి యున్న సమయంబున. ౯౦౨

క. ఇదె సుముహూర్తం బిప్పుడె
గదిసెను బరిణయము సేయఁ గావలె ననుచున్
ముదమున నార్యులు దెల్పఁగ
ముదిరధ్వను లట్ల తూర్యముల రొదలొప్పన్. ౯౦౩

క. జనకధరాపతి రామున
కును మధుపర్కంబు లొసఁగి కోర్కులు మీఱన్
వనజాతములను బోలు న
తనిపదములు గడిగి విమలతరసలిలములన్. ౯౦౪

గీ. కనక పాత్రాంతరాళసంకలితములగు
రామపాదోదకములు శిరంబునందుఁ
దాల్చి ధన్యుఁడనైతి నిద్ధాత్రి నంచు
సంతసించుచుఁ బిదప సజ్జనులు పొగడ. ౯౦౫

చ. కనకాంగిన్ హరినీలకుంతల లసత్కంజాతపాణిన్ సులో
చనయుగ్మన్ గజరాజగామిని శరచ్చంద్రాననన్ భూమిజా
తను సీతారమ ధారవోసెఁ దనుమధ్యన్ రాఘవోర్వీశనం
దనచూడామణి రామమూర్తికి సుధాంధస్తుత్యసత్కీర్తికిన్. ౯౦౬

వ. అప్పుడు. ౯౦౭

శా. వారాంభోజముఖుల్ నటింపఁ గవులున్ వర్ణింప గాతల్ మహో
దారుల్ గీతము లుచ్చరింప మునిబృందం బాత్మమోదింపఁగాఁ
బారావారమురీతి వాద్యతతి నిస్సాణంబుఁ బెంపన్ "ధ్రువం
తే రాజా వరుణో" యటంచు విబుధుల్ దీవింపఁగన్ సొంపుగన్. ౯౦౮

క. అంగజనిభుఁడగు రాముఁడు
రంగద్గుణశాలి లోకరక్షణమతి సీ
తాంగనకంఠమునం దిడె
మంగళసూత్రంబు ప్రౌఢిమం గళలొప్పన్. ౯౦౯

వ అయ్యవసరంబున. ౯౧౦

క. అచ్చరలాడిరి పాడిరి
ముచ్చట గంధర్వు లెల్ల మునివరు లెదలన్
జెచ్చెర సంతోషించిరి
హెచ్చుగ నాదిత్యభేరు లెల్లన్ మ్రోసెన్. ౯౧౧

క. క్షితిజాత లక్ష్మి, రాముఁడు
సితకమలాక్షుండు, వీరిచే మాకు మహో
న్నతసౌఖ్య మబ్బు ననుచున్
గుతుకంబునఁ బుష్పవృష్టి గురిసి రమర్త్యుల్ ౯౧౨

వ. అంత. ౯౧౩

సీ. సాధుసన్నుతుఁడైన జనకభూపతి దన
తనుజకుఁ దమ్ముని తనయలకును
బరిణయంబులు సేయ భావించి వరులకు
మధుపర్కము లొసంగి మఱియుఁదగిన
సత్కారములు చేసి సరగున నూర్మిళ
సౌమిత్రి కిచ్చెను సంభ్రమమున
మాళవి భరతకుమారుని కర్పించె
శ్రుతకీర్తి నిచ్చె శత్రుఘ్ను నకును

గీ. వరుసఁ దత్కన్యకలఁ గొని వారు దమకుఁ
బుడమివేల్పులు దీవన లిడుచునుండ
నిగమవచనోక్తవిధినిఁ గన్నియలమెడలఁ
గలిత మంగళసూత్రముల్ గట్టి రెలమి. ౯౧౪

క. అంతట రాముఁడు సీతా
కాంతయు నొండొరుల మస్తకముల న్గడు ని
శ్చింతత ముత్తెపుఁదలఁబ్రాల్
వింతగతి న్బోసి రెల్ల విబుధులు మెచ్చన్ ౯౧౫

శా. గౌరీపూజ లొనర్చి మానసములన్ గళ్యాణ మర్థించి త
త్సారానుగ్రహలబ్ధశోభనము నందంబొప్పఁగాఁ బూనుచున్
దా రాజిల్లుచు నున్నచంద్రముఖి సీతానామహారాద్యలం
కార న్రాముఁడు సప్తపాదములు ద్రొక్కం జేసె నుత్సాహియై. ౯౧౬

క. పూజితచరిత్రయగు ను
ర్వీజాసతిఁ గూడి జాతవేదునియందున్
లాజలహోమము చేసెను
రాజన్మతి రాఘవుండు రహి నవ్వేళన్ ౯౧౭

క. క్షితిపతినుతుఁ డగు రాముఁడు
ఘృతసమిధాదికములవలనఁ గీలిని సంత
ర్పితుఁ జేసె నిగమవచనో
దితపద్ధతి దప్పకుండఁ దేజం బెసఁగన్. ౯౧౮

వ. అవ్విధంబున లక్ష్మణభరతశత్రుఘ్నులును, వైవాహిక క్రియాపర
తంత్రులై దమ్ముం జూచుచున్న సకలజనంబులకు నేత్రోత్సవంబు
సంపాదించుచుండి, రిట్లు పాణిగ్రహణోత్సవానందితహృదయారవిందు
లగు నలుగురు పెండ్లికొమరులుం బెండ్లికూఁతులును బ్రదక్షిణపూర్వ
కంబుగా వీతిహోత్రున కరుంధతీవసిష్ఠులకుఁ గౌశికాదిమునిజనంబుల
కుం దశరథజనకులకు, మఱియుం దగిన విద్వత్సమూహంబులకుం

బురంధ్రీమణులకుం గ్రమంబున నమస్కరించి, తదాశీర్వచనంబులం
గైకొనుచుం దేజరిల్లుచుండి రనంతరంబ. ౯౧౯

సీ. దశరథావనిపతి ధరణీసురవర్యులఁ
గనుఁగొని మోదంబు గడలుకొనఁగ
నమితసంఖ్యల సువర్ణాంబర మాణిక్య
భూషణంబు లొసంగి పొల్పుమీఱఁ
గవిశిఖామణులకు గాయకోత్తములకుఁ
గామితార్థములిడి గారవించి
వందిమాగధులకు వైతాళికులకును
వారకాంతామణీ వర్గములకు

గీ. వలయు నన్నిపదార్థముల్ వరుస నొసఁగి
మఱియుఁ దగువారి కందంద మాన్యలీల
సకలవస్తువు లిచ్చుచు సాధునుతులు
గాంచి వెలయుచునుండె నఖండమహిమ. ౯౨౦

క. సీతాకల్యాణోత్సవ
మీతఱిఁ గనుఁగొనుటచే నహీనప్రమదో
పేతుల మైతి మటంచును
గీతంబులు పాడి రపుడు కిన్నరులు నరుల్. ౯౨౧

గీ. తనయులకుఁ బెండ్లి గావించు దినములందు
జనకభూతలపతి సర్వజనములకును
షడ్రసోపేతములగు భోజనము లిడుచు
దేవమానవవినుతుఁడై దేజరిల్లె ౯౨౨

వ. ఇట్లతిరమణీయంబై పరిణయమహోత్సవంబు ప్రవర్తిల్లుచుండ వాస
రచతుష్టయానంతరంబున వజ్రవైదూర్యవిద్రుమనీలగోమేధిక పుష్య
రాగపద్మరాగమరకతమౌక్తికరత్నంబులచేత రచియించిన ప్రోలియం
దు నవ్వధూవరులు ప్రవేశింప నాకబలివిధానంబును యథాక్రమం
బున నయ్యె; నయ్యవసరంబున ౯౨3

క. సంచితజనమోదములై
వంచితసురభేరికాంబువహనాదములై
పంచమహావాద్యంబు లు
దంచితగతి వెలయుచుండెఁ దఱుచుగ నచ్చోన్. ౯౨౮

క. కాంతలు సమయోచితగతి
స్వాంతంబుల నంకురించు సంతసములచే
నింతైన శంకలేక వ
సంతంబులు జల్లులాడ సాఁగిరి తమలోన్. ౯౨౯

వ. అప్పుడు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులం దత్కళత్రంబులం గాంచి యానందించుచున్న బుధజనులు వారలం గ్రమంబున వర్ణింపఁబూని రెట్లనిన. ౯౩౦

క. కంటిరె రాముని సీతని
వంటి మహాపురుషు ధీరవరు గుణశాలిన్
గంటిమె మెచ్చటనైనన్
వింటిమె పరికింప నితఁడు విష్ణుండుగదా! ౯౩౧

గీ. కుందమందారధవళారవిందబృంద
చందనసుకీర్తి రాజన్యవందనీయుఁ
డిందిరాజాతసుందరుం డిందువదనుఁ
డిందిరాజాతఁగూడి చెలొ్వందె నహహా! ౯౩౨

సీ. నీరజాతాక్షుఁడై నీలధారాధర
శ్యాముఁడై హేమవస్త్రములఁ దనరి
శ్రీగల నామంబుఁ జెంది సర్వజ్ఞుఁడై
రాజశేఖరుఁ డనఁ దేజరిల్లి
అజపితామహ వరాఖ్యాశోభియగుచును
సుమతి వాక్పతి యన సొంపు మీఱి
వసుపతియై యరివ్రజహార్షదుండై ప్ర
తాపియై లోకబాంధవత నలరి

గీ. యున్ననీరాము వర్ణింపఁ బన్నగేంద్ర
ధాతలకునైన వశమౌనె తథ్యమరయ
హరిహరబ్రహ్మ పంకజాప్తాత్ముఁ డితఁడు
గాకయుండినఁ దత్సమఖ్యాతిఁ గనునె. ౯౨౯

ఉ. మందరశైలధీరు నసమాన పరాక్రమశాలి మాలికా
చందనభూషణాన్వితు విశాలయశున్ నవహాటకోల్లస
త్సుందరమూర్తి నూత్నపరిశోభితకాంచనవస్త్రయుగ్మునె
న్నందగు వాని లక్ష్మణుఁ గనందగు సీతని నూర్మిళాపతిన్. ౯౩౦

క. భరతుని ముఖలీలాజిత
భరతుని సద్గుణమణీవిభాస్వచ్ఛరితున్
సరసాగ్రణిఁ గనుఁగొంటిరె
వెరవొప్పఁగ నున్న మాళవీనాయకునిన్. ౯౩౧

క. అన్నలకడఁ గడుభక్తిని
మన్ననసేయుచును మెలఁగు మాన్యుని నితనిన్
దిన్నఁగ నవలోకింపరె
సన్నుతు శ్రుతకీర్తివరుని శత్రుఘ్నాఖ్యున్. ౯౩౨

క. ఇందిర యనఁగాఁ దగు నిం
దిందిరసమవేణి ఘనమతిం జంద్రాస్యన్
కుందరదనాళి లసదర
విందాక్షిన్ సాధ్వి సీత వీక్షించితిరే. ౯౩౩

గీ. విబుధగణము లెపుడు వినుతింపఁ దగియెడు
మగఁడు గలుగఁగోరి జగతిలోన
విబుధగణము దన్ను వినుతింప మెలఁగు నీ
రామభార్య గాదె రామభార్య. ౯౩౪

సీ. చక్రవాకద్వంద్వచారుపయోధర
వారిజవదన యావర్తనాభి

కంబుకంఠి తరంగకమనీయవళి హంస
యాన సత్కోకనదారుణోష్ఠి
సైకతశ్రోణి విసారవిలోచన
చంచరీకాలకజాల రమ్య
భాసురకల్హారపాణి ఫేనస్మిత
మధురామృత విరాజమానవాణి

గీ. గానదిక్కాంత వాహినిగాఁగ నోపు
నట్లు గాకున్న నూర్మిళ యనఁగఁదగునె
లక్ష్మణునిపత్ని దీనిసులక్షణముల
వర్ణనముసేయఁ దరమె యెవ్వారికైన. ౯౩౫

క. సిరిగల కన్నులుగలిగిన
తరుణీమణి యిదియగానఁ దథ్యముగాఁగన్
బరఁగెను మాలవినాఁగను
భరతునిసతి జగతి నిట్టి భామిని గలదే. ౯౩౬

క. తనసాటి వారిలోపల
ఘనకీర్తులు గలిగి వెలయు కాంతామణిగా
వున శ్రుతకీర్తి యనంగాఁ
దనరున్ శత్రుఘ్నుపత్ని దర్శింపంగన్. ౯౩౭

వ. అని యిట్లనేకు లనేకవిధంబులం బ్రశంసించుచున్నంత సహోదరస
హితుండై జనకమహీశుండు దశరథేశ్వరున కిట్లనియె. ౯౩౮

క. మాకన్నెలఁ గోడండ్రుగఁ
గైకొంటివిగాన మేము కడుధన్యులమై
లోకములో వెలసితిమి ది
వాకరకులజాత నృపతివర్గవతంసా ౯౩౯

వ. అనిన నతం డతని కిట్లనియె. ౯౪౦

గీ. ధర్మగుణశాలి వరకుశధ్వజ వరుండు
తతభుజాటోపజితకుశధ్వజపరుండు
జనకుఁడను వార్తమించె నిజ్జగతియందు
నీచరిత్రంబు నాకు వర్ణింప నగునె. ౯౪౧

క. నీతనయల నీతనయల
నీతతి నానందనులకు నీ వొసఁగుటచే
నీతివిశారద జనకమ
హీతలవర మత్కులంబు హెచ్చె ధరిత్రిన్ ౯౪౨

వ. అని యగ్గించుచున్న సమయంబునం గౌశికమునీంద్రుండు సంతుష్టాంతరంగుండై జనకదశరథుల నాశీర్వదించి, వసిష్ఠాదిమహామునులం దక్కినవారల వీడ్కొని హిమశైలంబున కరిగె; నంత మిథిలాధీశ్వరుండును గూఁతులకు నుచితవాక్యంబుల నయవిశేషంబు లుపదేశించి, నూతనదివ్యాంబరాభరణ మణికనకచందనాగరు కస్తూరికాదు లొసంగి రాఘవులకుఁ గరితురగరథపదాతి కనకాంబరాదులు కానుకలిచ్చి మన్నించి దశరథేశ్వరు వీడ్కొల్పిన నతండు పుత్త్రవధూమిత్రామాత్య బంధుగణవాహినీ సమేతుండై యయోధ్యాపురంబునకు నరుదెంచు నెడ మార్గంబున, ప్రళయకాల కీలిపగిది దక్షాధ్వరసమయచండకోపసహిత వీరభద్రుమాడ్కి వెలుఁగు భార్గవరాము కుఠారచాపబాణధారిఁ గనుచు. ౯౪౩

క. అందఱు డెందములందున్
గొందలపడుచుండ నంత గొబ్బునఁ బజ్జన్
స్యందనముఁ డెదురేఁగుచు మది
యందున్ గడుభక్తి వెలయ నారామునకున్. ౯౪౪

గీ. అర్ఘ్యపాద్యము లొసఁగిన నాదరింప
కతఁడు రాఘవుచెంతకు నరుగుదెంచి
దీప్తపావకుచందానఁ దేజ మెసఁగ
నిలిచి యున్నంత రఘురాముఁ డెలమి మ్రొక్కి ౯౪౫

వ. అతని తేజోవిశేషంబున కచ్చెరువుపడుచుండ రామచంద్రునకుఁ బరశు
రాముం డిట్లనియె, ౯౪౬

ఉ. నీపరవిక్రమంబు విని నెమ్మదిలోన సహింపలేక నీ
లావు గనంగ వచ్చితిని లక్ష్మణుఁ డీవును గూడి చాపవి
ద్యావిదులైతి రంట విబుధస్తుతు లొందితిరంట బల్మిచే
శైవశరాసనంబు లఘుపారముఁ జేసితివంట రెంచుగన్. ౯౪౭

క. విలు విఱుచు మాత్రమున ని
న్నలఘుబలుం డనుచు జనకుఁ డాత్మఁ దలఁచుచున్
లలి నొసఁగె నీకుఁ దనసుత
నలివేణిని సీత నృపతు లవివేకులు గా ౯౪౮

గీ. చివుకు విల్లు విఱచి సీతను జేకొను
నంతమాత్ర గర్వ మంద రాదు
చేవగలుగు నాధనుసింగాణి యెక్కిడి
శరముఁగూర్చి గర్వపరుఁడ వగుము. ౯౪౯

క. సీతోడ రణముఁ జేయుఁగఁ
జేతోమోదంబుగలిగి చేరితి నిటకున్
నాతెఱఁ గిటు లెఱిఁగించితి
భీతిల్లక నిలిచిపోరు బీర మెలర్పన్. ౯౫౦

క. ముయ్యేడుమార్లు నృపతుల
కయ్యంబులఁ దునిమినట్టి ఘనుఁడను నను నీ
వియ్యెడ ననదుగఁ జూడకు
మయ్యా భృగురాముఁ డనఁగ నమరినవాఁడన్. ౯౫౧

క. రాముఁడన నే నొకండన
భూమీస్థలి పేరులందుఁ బొగడికఁ గంటిన్
నేమఱు మదన్యవీరుని
రాముని గీముని నెఱుఁగ రఘువంశభవా ! ౯౫౨

క. అనవుడు దశరథుఁ డెంతయు
మనమున బెగడొంది యతని మాన్యచరిత్రుఁ
ఘనతరకుఠారధారా
వినిహతనృపు రాము నిట్లు వేఁడఁదొడంగెన్. ౧౯౩

ఉ. బాలుఁడు రామచంద్రుఁడు కృపాయుత ! క్రొత్తగఁ బెండ్లియైనవాఁ
డీలలితాంగుఁ బ్రోవ నిఁక నెవ్వరు గల్గుదు రీవె కాక ము
న్నాలము చేసి నేరఁడు మహాత్ములజాడ లెఱుంగ లేఁడు నీ
జాలిఁగ వేఁడుకొందు నను సన్నుతిఁబూని కుమారుఁ బ్రోవవే. ౧౯౪

క. వరగుణుఁడగు కశ్యపునకు
ధరయెల్ల నొసంగినట్టి దాతవుగానన్
కర మర్థి నిన్ను వేఁడెదఁ
జిరపుణ్య యోగివీరశేఖరగణ్యా. ౧౯౫

క. శ్రుతులన్ని చదివి తద్గత
మతి విజితేంద్రియుఁడ వగుచు మానివరుఁడవై
సతతము సన్నుతిఁ గనుచీ
కతికోపము దగునె యిటు లహఃపతితేజా! ౧౯౬

గీ. అనుచుఁ బ్రార్థింప నమ్మాట లాదరింప
కపుడు జమదగ్నిమునిసుతుం డధికరౌద్ర
రసము దీపించుచుండఁగా రామభద్రు
సుజనరక్షాకనిద్రుని జూచి పలికె. ౧౯౭

గీ. నాకు గురుఁడైనయట్టి పినాకిధనువు
విఱిచినాఁడవుగాన నివ్వేళ నిన్ను
నిగ్రహించెద నిఁక రా దనుగ్రహంబు
కోరి భీతిని బ్రతిమాలుకొనిన విడువ. ౧౯౮

గీ. రాజశబ్దంబు మత్కర్ణరంధ్రమునను
బడిన ఘృతదీప్తిఁ బావకుభంగి రోష
మడరు రాజవు రాముఁడవైన నిన్నుఁ
గాంచి యూఱక యెట్లు సహించియుందు ౯౨౯

వ. అదిగావున. ౯౩౦

క. అండజపతిగమను ధను
ర్దండము మత్కరమునందుఁ దనరుచునుండెన్
దండములు మాని యిదె కో
దండముఁగొని బల్మిఁజూపు దశరథపుత్రా! ౯౩౧

చ. అనుడు విభాకరాన్వయమహాంబుధిసోముఁడు రాఘవుండు పా
వనచరితుండు దివ్యమునివంద్యుఁడు భార్గవు బల్కె నీకు నే
ముని వని పెద్దవాఁడవని మ్రొక్కితిఁగాని ధనుర్ధరుండనై
యని యొనరింపలేక యెద భయంపడి కాను కృపాత్మభూసురా! ౯౩౨

వ. అనిపల్కి తదవసరంబున. ౯౩౩

ఉ. వాసవవిక్రముండు రఘువర్యుఁడు భార్గవరాము వేఁడి బా
ణాసన మందికొంచు రయమారఁగ సజ్యము చేసి బాహుశో
ల్లాసముతోడ మార్విఁగొని లాఘవ మొప్పఁగఁ గర్ణమందరాఁ
దీసి గుణధ్వనుల్ సలిపి దివ్యశరంబు సమర్చి లీలతోన్. ౯౩౪

క. నావిశిఖ మమోఘం బిది
గావున నీపాదయుగము ఖండింపుదు భూ
దేవా భార్గవ! యనినన్
దా విని భృగురాముఁ డెదను దల్లడపడుచున్. ౯౩౫

క. బలతేజోరహితుండై
చల ముడిగిన మతిని రామచంద్రునితోడన్
బలికెను మృదుతరభాషణ
ముల సాత్త్వికవృత్తి నిక్కముగఁ దోఁపంగన్. ౯౩౬

సీ. రామరాఘవ పాండురాజీవలోచన
రాజవందిత పదాంభోజయుగళ
తాటకాంతక బాణదళితనిశాచర
శరదిందుచంద్రికాచారు కీర్తి
కౌశికయాగరక్షాదక్ష యాత్మ ద
ర్శనపవిత్రీకృతమునికళత్ర
వర్షావసరవారివాహసన్నిభగాత్ర
సారసమిత్ర లసత్పవిత్ర

గీ. దశరథావనిపాలనందన మహాత్మ
పాలితాఖిలలోక కృపాసముద్ర
భూసురావననిరత సీతాసమేత
నిన్ను నతిసేయనేర్తునే నిగమవినుత. ౯౬౭

గీ. జానకీనాథ నీవు నిశ్చయముగాఁగ
మనుజరూపముఁ గనినట్టి మాధవుఁడవు
గాకయుండిన నాచేతికార్ముకంబు
నెక్కువెట్టంగ శక్యమే యెవ్వకైన. ౯౬౮

క. నీకును నాకును భేదము
లేకుండఁగ నిట్లు కుండలిశయాంశముచే
లోకమునఁ బుట్టినారము
వైకుంఠునిమహిమ నెన్నవశమే విధికిన్. ౯౬౯

క. నిన్నొకటి వేఁడుకొనియెదఁ
గ్రన్నన నామనవి నీవు గైకొనవలయున్
సన్నుతగుణ మణిభూషణ
యన్నాయని పొగడి మఱియు నతఁడిట్లనియెన్. ౯౭౦

గీ. తొలుతఁ గశ్యపునకు నిలయెల్ల నొసఁగితి
నవని విడిచి యేఁగ మనియె నతఁడు

దాన మనములో ముదంబొప్పఁగ మహేంద్ర
నగనివాసినైతి నాఁటఁగోలె. ౯౨౧

వ. అదిగావున. ౯౨౨

సీ. ప్రతిదినంబు మహేంద్రపర్వతంబునకు సా
యంకాలమునకు నే నరుగవలయుఁ
గాన నాపాదయుగంబు మన్నాశక
కరుణింపవలయు నీ వురుబలాఢ్య
రాఘవ నీదు శరం బమోఘముగాన
సరగున మత్పుణ్యసంచయంబు
విదళింపు మనిపల్క వినుచు నారఘురాముఁ
డతఁడు గోరిన యట్టులాచరింపఁ

గీ. పరమసంతోషకలితుఁడై భార్గవుండు
రామచంద్రునివలనఁ గొని రయముతోడ
దశరథేశ్వరు చెలిమి నొందఁగ నతించి
వినయరీతి నిజస్థానమునకుఁ జనియె. ౯౨౩

వ. అంతకుమున్న మహావీరులగు రఘురామ భృగురాముల పరాక్రమంబు లరయుటకు నరుగుదెంచియున్న పంకజాసనపాకశాసనప్రముఖ బృందారకులును గరుడగంధర్వ కిన్నరకింపురుష యక్షరక్షస్సిద్ధచారణాదిదేవయోనులును బహువిధంబులగు సాధువాదంబుల నారామభద్రుం బ్రశంసించి కుసుమవర్షంబులుగురియించి, యంతర్ధానంబు నొంది రనంతరంబ. ౯౨౪

క. తనతనయు విక్రమమునకు
మనమున మోదించి గుణసముచితుఁ డజనం
దనుఁడు సపరివారుండై
చనుదెంచె నయోధ్యకడకు సన్నుతులొప్పన్. ౯౨౫

గీ. ఇట్లువచ్చిన నవ్వార్త యెఱిఁగి పౌరు
లెలమి నెదు రేఁగి బహువిధంబుల నుతించి
తోడుకొని రాఁగ నాలంద వేడుకలరఁ
బురముఁ జొచ్చెను నవపురందరుఁ డనంగ ౯౭౬

వ. ఇట్లు పురంబుఁ బ్రవేశించి ౯౭౭

క. రాజీవముఖులు వెస నీ
రాజనము లొసంగ వందిరాజి నుతింపన్
రాజిత గణికాజనమణి
రాజులు నటియింపఁ దూర్యరవములు చెలఁగన్. ౯౭౮

మ. జగతీనాయకుఁ డాత్మమందిరము నిచ్చం జొచ్చె నవ్వేళఁ ద
న్మృగనేత్రల్ సకళత్రులైన సుతులన్ వీక్షింప నేతెంచిరన్
నగవుల్ మోముల నంకురింపఁగ మహానందాప్తులై వారలన్
దగఁ గౌసల్యకుఁ గైకకున్ వరసుమిత్రాదేవికిన్ మ్రొక్కినన్. ౯౭౯

గీ. పుడమితేని సతులు కొడుకులఁ గోడండ్రఁ
గాంచి ప్రేమరసము లంచితముగ
మించియుండఁ గౌఁగిలించుచు దీవించి
సంతసించి రాత్మసరసిజముల. ౯౮౦

వ. తదనంతరంబ. ౯౮౧

చ. సతులు తనూజులున్ దనయజాయలు నాత్మల మోదమందఁగా
సతతము శోభనంబుల నిశాంతము శోభిలుచుండఁగాఁ బురో
హితులును బంధువుల్ హితులు హెచ్చఁగ మెచ్చఁగ మంత్రివర్గముల్
క్షితితల మెల్ల నేలె నృపశేఖరుఁ డెంతయు నీతిచాతురిన్. ౯౮౨

క. అనిచెప్పిన విని పుట్టం
జనియించిన యట్టిమౌని సరసిజభవనం
దనుఁగని యవ్వాలికథ నా
కనఘా! కృపతోడఁ జెప్పుమని పల్కుటయున్. ౯౮౩

గర్భస్రగ్విణీభుజంగ ప్రయాతద్రుత విలంబిత వృత్తసీసము:—

ఈశానభూధరా ధీశ్వగోద్భూత దా
రాస్వతా శాకుంజరాస్యజనక
ధీశాలి మాధరీశ్రీశసన్మానిత
ప్రాభవాఢ్యా భర్గభావజారి
యవిరళదోర్ధర ణ్యాదికాస్తోకత
స్వష్టకార్యావసిష్ఠాదివినుత
యగచాపగోధురి స్థారి రాఘోర దో
ర్గర్వహారీశరత్కంధరాభ
శివమహేశ్వర శ్రీగళ చిన్మయాత్మ
భువనరక్షణ భోగిభిభూషణాళి
దివిజవంద్య నదీధర దీనపాల
భవలసన్మృదుభాషణ భద్రదాత. ౧౮౪

సగర్భ మత్తకందసీసము:—

విజితనాగాసుర వీరపంచముఖ భ
స్మీభూత పుష్పాయుధాధవాళ్య
మహిత నారాయణ మార్గణా యనఘన
గ్వేషాగిరీశా శివా శరణ్య
వితతకారుణ్య సువిక్రమానిటలనే
త్రాపన్నగేద్భూషణా పురారి
సుకృతి సంస్తుత్యవిశుద్ధమానపినాకి
పార్వతీవల్లభా—పరార్థ్య
హార కువలయాప్త శేఖర సరసిజభవ
హరిహయాద్యజరవరవంద్యా సురుచిర
గురుతరయశ శుభకర సుచరితసకల
వరద కరిముఖజనకా దివాకరాభ. ౧౮౫

కందమణి గణనికరము:—

సురనుత పురహర సురుచిర
కరుణాకర కరతలధృతఘనతరహరిణా
చిరతర గురుయశక్షితిధర
శరణాసరస హృదయ కమలజన నతచరణా ! ౯౹

గద్య:—ఇతి శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షసంలబ్ధసరస కవి
ధారాసుధారసపాత్ర హారీతసగోత్ర పవి త్రాపస్తంబసూత్రవినుత
బుధసమాజ మంత్రిప్రగడ వంశరత్నాకర ద్విజరాజ
శరభరాజామాత్యపుత్ర వివిధ విద్వజ్జనవిధేయ
సూర్యప్రకాశ నామధేయ ప్రణీతంబైన
సీతారామ చరిత్రంబను మహా
ప్రబంధంబునందు ప్రథ
మాశ్వాసము.

శ్రీ భీమలింగేశ్వరార్పణమస్తు.

---

